GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి

సంపుటము ౨౦] ఏప్రెల్ 1951 [సంచిక ౪




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన నారంభము చేయవచ్చును. విడికాపీలు వలయు వారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందియవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగనున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక





—(०)—

*




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!

జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

# కేసరీకుటీరం స్వర్ణోత్సవం

——(o)——

"గృహలక్ష్మి" కి మాతృసంస్థయైన "కేసరీ కుటీరము" నకు ఈ 1950 సం॥తో 50 సం॥ లు నిండినవి. సాంప్రదాయానుసారము ఈ మార్చి 23, 24 తేదీలలో "కేసరీ కుటీరము" సువర్ణోత్సవమును అతివైభవముగా జరుపుకొన్నది. దీని యజమానులగు కేసరీకుటీరం లిమిటెడ్ వారు సిబ్బందినంతయు అనేకవిధముల సంతృప్తుల గావించి కృతకృత్యులైరి; నగరమండలి, రాష్ట్రమండలి పలువురు పెద్దలకు తేనీటి విందుగావించి వారి ఆశీర్వచనములబడసిరి. శీతారాం జనరల్ స్టోర్సు ఏజన్సీస్‌వారు బంగారు పూతపూసిన రజిత కుటీరభవనపు మూర్తిని కుటీరస్థాపకులగు డాక్టరు కేసరిగారికి సమర్పించి తమ కృతజ్ఞతను వెల్లడించిరి. కుటీరపుసిబ్బంది శ్రీవారికి రజిత పూజామందిరము నర్పించి పునీతులైరి.

1900 సం॥ న తాముస్థాపించిన కేసరీకుటీరమునకు సువర్ణోత్సవము జరిపించి ఆనందించిన శ్రీ కేసరిగారు ధన్యులు. ఒక సంస్థను నిర్మించినవారే స్వయముగ్గా సువర్ణోత్సవము గావింపించి చూడగల్గుట సామాన్యముగా అరుదు. అట్టిమహాద్భాగ్యమునకు నోచుకొన్న శ్రీ కేసరిగారు ధన్యాత్ములు. నాడుబొగ్గుతో నల్లపట్టణమున (అప్పుడు జార్జిటానును బ్లాక్ టౌన్ అనేవారు) నొక మూరుమూల చిన్న అద్దెయింటి గోడపై "కేసరి కుటీరం - ఆయుర్వేద ఔషధశాల" అని వ్రాసుకొన్న శ్రీ కేసరిగారి నిష్కల్మష హృదయము, దీక్ష, దక్షత, నిరంతర కృషి మొదలైనవాని ఫలితముగా నేడు సువర్ణోత్సవమునాటికి ఆ పేరే భారత దేశపు వాణిజ్య చరిత్రయందు సువర్ణాక్షరముల లిఖింపబడియున్నది. ఇదెంతయు గర్వింప దగిన విషయము.

ఈశతాబ్దములో ఆంధ్రులొక సంస్థనునిర్మించి, దానిని 50 సం॥ల పాటు దిన దినాభివృద్ధిగా నడిపి, చిరస్థాయిని గావించుట సామాన్యముగ అపూర్వము. ఆవిధముగా శ్రీ కేసరిగారు, ఆంధ్రులలోను కార్యదీక్షాపరులు, సమర్థులు, నిర్మాణకుశలురు, వ్యాపారచతురులు కలరని లోకమునకు రుజువుపరచి ఆంధ్రజాతికి వెలలేని కీర్తి సంపాదించిపెట్టిరి.

ప్రాయికముగా ధనాఢ్యులు తమ ఆర్జనను తాము అనుభవించుదురు; తమవారి నాదరింతురు. శ్రీ కేసరిగారంతట తృప్తినొందక అనేక దానధర్మముల నొనర్చి, కేసరి హైస్కూలు మున్నగు సంస్థలనెలకొల్పి ఆంధ్రులను తీర్చలేని ఋణస్థులనొనర్చినారు.

శ్రీ కేసరిగారు సుమారు 4 సం॥లుగా అస్వస్థులై యుంటున్నారు. అయితే రిక్తుడుగా, బాలుడుగా చెన్నపట్నమునచేరి ఏ మనోనిబ్బరముతో కేసరికుటీరమును స్థాపించి 50 సం॥ లలో పెంచి పెద్దదానినొనర్చిరో, ఆమనోనిబ్బరముతోనే ఈయుత్సవమును స్వయముగా గావించి చూచి ఆనందింపగల్గిరి. ఇందుకు ఆంధ్రులందరితో పాటు "గృహలక్ష్మి" యు హర్షించుచున్నది.

శ్రీ కేసరిగారికి ఆయురారోగ్యము లొసంగి ఈశ్వరుడు బ్రోచుగాక. "కేసరీకుటీరము" చిరస్థాయియై తన్నాశ్రయించిన చిరు సంస్థల నన్నిటిని సదా నిర్వహించుచు క్రమముగా రతోత్సవమును, సప్తతి యుత్సవమును, అనేక శతవార్షికోత్సవములను జరుపుకొనునుగాక.

వెం.

—(o)—

# కేసరికుటీరం స్వర్ణోత్సవ వృత్తాంతం



1900 సం॥న ప్రారంభింపబడిన "కేసరికుటీరము" నకు 1950 సం॥తో 50 సం॥ల ప్రాయమునిండగా 23-3-51 & 24-3-51 తేదులలో చెన్నపట్నం, రాయపేట యందలి విశాలమగు కేసరికుటీరం భవనమునందు అతివైభవముగా స్వర్ణోత్సవము జరుపబడినది. కొంతకాలముగా అస్వస్థులయ్యు, కుటీర స్థాపకులును, "కేసరి కుటీరం లిమిటెడ్" మానేజింగు డైరెక్టరును అగు శ్రీ డాక్టరు కే. యన్. కేసరిగారు స్వయముగా అన్ని యేర్పాట్లను చూచుచు, కుటీరమునకు, దానియుపసంస్థలకు చెందిన సిబ్బందియు, వివిధ ప్రాంతమందలి ఏజంట్లున్నూ, ఇష్టబంధుమిత్ర వర్గమును, ఉత్సవలోలురై తన్ను బలిసి కొలిచియుండగా వారందరిని వారివారి కర్హరీతి యథోచిత సత్కారములతన్పి ఒక్కొక్కరి యానందమును మొత్తముగా తామొక్కరే అనుభవించుచు ఉత్సాహోద్రిక్తులై ఉత్సవములనడిపించిరి. చిన్ననాట కేసరిగారు బొగ్గు అక్షరములతో వ్రాసిన "కేసరికుటీరము" అను పేరు నేడు సువర్ణాక్షరముల సుస్థిరమై వెలయుచుండ, ఆసంస్థ తన సువర్ణోత్సవమును నిజజనకుని మ్రోల జరుపుకొనుచుండుట ఇతరులనే ఆనందాతిశయమున ముంచి యెత్తుచున్నదనగా ఇక నాజనకుని సంగతి చెప్పవలయునా!

23-3-51 ప్రాతఃకాలమున చక్కగా అలంకరింపబడిన కేసరికుటీరము భవనములోనికి కుటీరపు సిబ్బంది యొక్కరొక్కరుగా ఉచిత వినీత వేషధారులై నగుమొగముల వచ్చి చేరిరి. ఆ ప్రాతఃకాలముననే విజయవాడలో కుటీరము ఏజంట్లు అగు సీతారామ జనరల్ స్టోర్సు ప్రొప్రయిటర్లు శ్రీ రాం భీమ శంకరరావు సీతాపతిగార్లును, మధుర బ్రాంచికి చెందిన కె. ఎల్. కాంతయ్యగారును, కొచ్చిన్ ఏజంటుగారును విచ్చేసి ఉత్సవమున యథాక్రమముగ పాల్గొనిరి.

మేడమీద పైఅంతస్థున శ్రీ కేసరిగారి నిత్యపూజామందిరమున శ్రీ సుబ్బయ్యశాస్త్రిగారు యథావిధిగా పూజాపునస్కారములు సల్పిరి. శ్రీ కేసరిగారు ఆ ప్రక్కనే సుఖాసీనులైయుండి పూజాతీర్థ ప్రసాదములను తమ సిబ్బందితోపాటు స్వీకరించి శాస్త్రిగారి మహదాశీర్వచనమును వడసిరి. ఆ తరువాత ఎల్లరికి కాఫీ ఇడ్లీ ఫలహారము లొసంగబడెను. పిదప మధ్యాహ్నమున తాబేదారులందరికి మద్రాసోపేతముగ విందొనర్పబడెను. అస్వస్థతచే తాము పథ్యపానముల నలుగుచున్నను, శ్రీ కేసరిగారు పంక్తుల మొదట కూర్చుండి పేరుపేరు వరుసన అడిగి ఏమేమి కావలయునో కనుగొనుచు, అందరకు సుష్టు పూర్తిగా వడ్డించుడని హెచ్చరించుచు తృప్తిగా భుజించుచున్న వారింగాంచి ఆనందించుచుండిరి. తాంబూల చర్వణానంతరము కొంతవిశ్రాంతి గొన్నపిదప సిబ్బంది తరఫున శ్రీ యస్. టి. ఆర్. అయ్యంగారు శ్రీ కేసరిగారి నీశుభసమయమున యథోచితముగా కీర్తించి తమకృతజ్ఞతను వెల్లడించిరి. అంత శ్రీ కేసరిగారు చందన ఫల తాంబూల యుక్తముగా సిబ్బంది కందరకు నూతనవస్త్రముల నొసంగి, వానితోపాటు ఒక్కొక్కమాసపు వేతనమును పారితోషికముగా నొసంగి సత్కరించిరి.

ఆర్. మునుసామి మొదలియార్. ప్యాకింగ్ మేస్త్రీ, 20 ఏండ్లుగా పనిచేయుచున్నవాడు.

యన్. మునుసామి మొదలియార్. మందుల కార్ఖానా మేస్త్రీ.

ఈ తేనీటివిందునకు విచ్చేసిన ప్రముఖులు:- ఇంతవరకు పేర్కొనబడిన వారుగాక లెఫ్టనెంటు కల్నల్ పండాలై, బాపినీడు, అల్లూరి సత్యనారాయణరాజు, కె. యస్. జయరామయ్యర్, డా. సి. ఆర్. కృష్ణపిళ్లె, డా. దేశికాచారి, డాక్టరు జమ్మి వి. బదరీనారాయణ, ప్రొ. వి. వి. శర్మ, మునగాలరాజా, బండి శ్రీ హరిరావునాయుడు, పురం ప్రకాశరావు యం. శేషాచలపతి, శ్రీపతి రామమూర్తి, అరుణాచలయ్యర్ (పుదుచ్చేరి) గొల్లపూడి కామేశ్వరశర్మ, కోటకాశీపతి (వంగోలు) రామచంద్రుల జగన్నాథంగార్లు.

ఈ ఉత్సవసందర్భమున అందమైన యొక "స్వర్ణోత్సవ గ్రంథము" ముద్రితమై పంచిపెట్టబడినది. అందలి కడపటిపుటపై 50 సం॥ల అభివృద్ధి సూచకముగ వెలసిన లోధ్ర విజయధ్వజమునకు కట్టబడిన గంటల నొక మాత మ్రోగించుచున్న చిత్రము ఆకర్షణీయముగా నున్నది.

తేనీటివిందు అనంతరము ఎల్లరు భవనములోనికి చేరగా శ్రీమతి కోటూట్టిల్ జానకి, శాంతకుమారి గార్లు చక్కని సంగీతామృతముచే ఎల్లరిని ఆనందాతిశయమున ముంచివైచిరి.

అంతటితో కేసరికుటీరము స్వర్ణోత్సవము ముగిసెను. విందునకు విచ్చేసిన పెద్దలందరు విడిగా విడిగా శ్రీ కేసరిగారినభినందించి, సంస్థను స్థాపించిన వారే దాని స్వర్ణోత్సవమును సల్పి ఆనందింపగల్గినందుకు వారి భాగ్యవిశేషమును వేనోళ్లపొగడి ఈశ్వరుడు రత్నోత్సవము నిట్లే జరిపించుటకు వారికి తగిన ఆయురారోగ్యము లొసంగుగాక యని ఆశించిరి.

# సందేశములు

## శ్రీయుత ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు, బి. ఏ. బి. ఎల్. నెల్లూరు.

నాకు మీతోటి స్నేహము 1898 సం॥ నాటిది. అట్టివాడనుగావున మీరు గొప్పగా సాధింపగల్గిన దానినంతయుజూచి వ్యక్తిగతముగ గర్వించుచుందును. ఆతొలిరోజులలో ఎన్నోకష్టముల నెదుర్కొని ధైర్యముతో పోరాడితిరి. పట్టుదలను, సేవానిరతిని చూపితిరి. ఇందులకుతగిన ప్రతిఫలమును భగవంతుడు మీకు జూపెను. మీ నూతన యత్నారంభోత్సాహమునకన్న మీవితరణశీలము తక్కువైనది కాదు. ప్రజారోగ్యము, స్త్రీ జనోద్ధరణము, విద్యావ్యాప్తి అనేవానికి మీ జీవితమునంకితము గావించితిరి. భగవంతుడు మీకాయురారోగ్యముల నొసంగి ఇతోధికముగ నాయాపుణ్యకార్యముల నొనర్ప తోడ్పడునుగాక.

## శ్రీ అద్దంకి వెంకట్రామయ్యగారు, బి. ఎ. బి. ఎల్., రిటైర్డ్ జిల్లాజడ్జి, అద్దంకి, వంగోలు తాలూకా.

మీ వైద్యనిలయ స్వర్ణోత్సవాహ్వానమునకు కృతజ్ఞుడను. నా హృదయపూర్వకాభివందనములను గైకొనుడు. ఈ శుభసమయమున మీకు నా శుభాకాంక్షలు. ఈ యుత్సవమునకు స్వయముగా రాజాల నందుకు క్షమించుడు.

**శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు, బాపట్ల.**

అయ్యా,

ఆంధ్రమహిళల ఆయురారోగ్యాభివృద్ధికై వెలసిన కేసరీకుటీరము స్వర్ణోత్సవము జరుపగల భాగ్యము గలిగినందుల కత్యంతానందముగా నున్నది. తాము ఆరోగ్యముగానుండి కేసరికుటీరము స్వర్ణోత్సవము, గృహలక్ష్మి స్వర్ణకంకణోత్సవము జరుపుటను విని ఆనందించుచున్నాను. దూరాభారమగుట ఈ మహోత్సవములో పాల్గొనమికి క్షమింపవలెను.

**త్యాగాసేవాసక్త, గాన కళావిశారద, విద్యాసుందరి**
**శ్రీమతి బెంగుళూరి నాగరత్నంగారు - తిరువైయూరు.**

"హృదయపూర్వకమైన అభివందనములు; రత్నోత్సవమునున్నూ జరుపుకొందురుగాక. (తంతి)

**రావుబహదూరు శ్రీ కె. జి. బాబురావుగారు, ఎం ఏ. బి. యల్, రిటైర్డు జడ్జి, మచిలీపట్నం.**

అయ్యా,

కేసరికుటీరం స్వర్ణోత్సవాహ్వానమును కృతజ్ఞతతో స్వీకరించితిని. కేసరికుటీరము స్వల్పముతో ప్రారంభమై కేవలము డాక్టరు కేసరిగారి, వారిసహాయకుల శక్తి సామర్థ్యములవలన నేటి ఉన్నతస్థితికి రాగల్గినది. ఇది ఆంధ్రులందరికి గర్వకారణము. నిజానికి డాక్టరు కేసరిగారి గొప్ప వితరణవల్ల ఈ సంస్థ ఆంధ్రులందరికి పెద్ద అండయైనది.

**శ్రీమతి డా. ముత్తులక్ష్మిరెడ్డిగారు. అవ్వైహోం, అడయారు.**

తాము గత 50 సం॥ లనుండి సదుద్యమపరాయణులై యున్నారు. కావున మీ ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికై ప్రార్థించెదను.

**శ్రీ టి. వి. శివరామయ్యగారు, బి. ఎ. బి. యల్., నెల్లూరు.**

అయ్యా,

తమ యాజమాన్యమున కేసరీ కుటీరము గొప్ప ప్రజాసేవ గావించుచున్నది. 'కేసరి రత్నత్రయము' దేశప్రఖ్యాతిగలది. వైద్యరంగమున తమ వారొక్కరిట్టి అద్భుత విజయము గాంచగలిగిరనుట, నెల్లూరివారమగు మాకు గొప్ప గర్వకారణమగుచున్నది. ఇంకను విశేషమేమనగా, మీశక్తి సామర్థ్యములను 'గృహలక్ష్మి' పత్రికను నడుపుచూ స్త్రీల అభివృద్ధికిన్ని, 'కేసరిహైస్కూలు' స్థాపించి ఆంధ్రుల విద్యాభివృద్ధికిన్ని వినియోగించుచున్నారు. మద్రాసు రాష్ట్రపౌరులు ముఖ్యముగా ఆంధ్రులు మీయెడల తమ కృతజ్ఞతను పూర్తిగా వెల్లడింప జాలకున్నారు; ఈ సమయమున దానిని వారర్హరీతిని వ్యక్తపరతురని ఆశింతును.

### శ్రీ కె. వెంకటస్వామినాయుడుగారు, బి. ఏ. బి. ఎల్.; ఎమ్. ఎల్. సి., అప్పా గార్డెన్స్, కీల్పాక్, మద్రాసు.

అయ్యా,

కేసరికుటీరం స్వర్ణోత్సవ సందర్భమున నా హృదయపూర్వకమైన అభివందనముల నందుకొనుడు. వ్యాపారము నభివృద్ధిపరచితిరి; మానవలోకమునకు సహాయము చేస్తిరి; ఆ లాభములనుండియే అనేక దాన ధర్మములొనర్చితిరి. గర్వింపదగిన దానిని సాధించితిరి. భగవంతుడు మీకు ఇతోధికైశ్వర్యమును, సౌఖ్యమును చేకూర్చుగాక.

### శ్రీ ఎమ్. వి. వెల్లోడి, బెంగుళూరు.

మనదేశమున సంస్థల ఆయుఃపరిమాణము సామాన్యముగా క్లుప్తము; అందుకుగల కారణములు మీకు బాగుగా తెలియును. కావున మీసంస్థ స్వర్ణోత్సవము జరుగుచున్నదన్నచో అది మీకు న్యాయముగా గర్వకారణము; మీరు సేవించుచున్న ప్రపంచమునకును మిమ్ము అభినందింపదగిన హంశము. మీరింకను చిరకాలము జీవించి దీని రతోన్నోత్సవమును జరుపుకొందురుగాక యని కోరుచున్నాము.

### శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారు, బి. ఏ. బి. యల్. భారత పార్లమెంటు సభ్యుడు, పార్లమెంటు డిప్యూటీ స్పీకర్, న్యూఢిల్లీ.

మీ అర్క, అమృత ప్రజలకెంత ఉపయుక్తమో నేను స్వయముగా ఎరుగుదును. ఆయుర్వేద వైద్యశాస్త్రమున సరియగు పరిశోధన చేయవలసిన అవసరము ముఖ్యమైయున్నది. కావున మన పూర్వులు ఈ వైద్యవిధానమునుగూర్చి బాగుగాచదివి వృద్ధిపరచుట కనువైన యొకసంస్థను తాము నెలకొల్పుదురని ఆశించుచున్నాము.

### శ్రీ రవివర్మ (కుట్టప్పన్) తంబురాన్. త్రిపున్నిత్తుర.

మీ వ్యాపారము అధికముగా విజయము గాంచవలయుననియు, మీకు దీర్ఘాయురారోగ్య సౌఖ్యము లొనగూర్చుగాక యనియు దేవుని ప్రార్థించుచున్నాను.

### శ్రీ కే. కే. మీనన్ బి. ఏ. బి. యల్., యక్జిక్యూటివ్ ఆఫీసర్, నడువిల్ మడందేవస్వములు, పాల్ఘాట్.

ప్రియమైన బావగారూ,

ఇచ్చట ఒక దేవాలయంలో ముఖ్యమైన ఉత్సవము 25 వ తేది జరుగనున్నదిగాన రాజాలకున్నాను, మీరీయుత్సవము సలుపుట కెంతో సంతోషించుచున్నారని తలంచెదను. కొద్దితో ప్రారంభించి, పట్టుదలతోను, అనేక ఇబ్బందుల నెదుర్కొనుటతోను, ఇంత గొప్పవ్యాపారము నెట్లు పెంపొందింప గల్గితిరో, వెనుకకు తిరిగి చూచుకొందురనియు తలంతును. నేను స్వయముగా రాజాలకున్నను, ఈ యుత్సవము జయప్రదముగా కొనసాగుగాకయని దేవుని ప్రార్థించుచుందును.

## వీరుగాక ఇంకను సందేశములంపిన ప్రముఖులు:—

శంకర్ అండుకో, మధుర; పి. గోపాలకృష్ణ, మానేజర్ బిల్డింగ్ & ఫైనాన్సుకంపెనీ లిమిటెడ్ వగైరా, మద్రాసు; కర్జన్ అండుకో, మద్రాసు; చాముండియాటాకీ డిస్ట్రిబ్యూటర్స్ లిమిటెడ్, విజయవాడ, వి. యంబెరుమానార్ చెట్టి, హా అండ్ కో, మద్రాసు, టి. యన్. జి. నెడుంగాడి, సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, తిరుచూరు; డి. వి. రెడ్డిపంతులుగారు. యం. యస్ సి. (లండన్) బి. యల్. అడ్వకేట్, మద్రాసు, డి. యస్. అబ్రహాం అండుకో, తిరునెల్వేలి; యం. హనుమంతరావుగారు ఎం. ఏ. బి. యల్. అడ్వకేటు నెల్లూరు, టి. యం. కే. నెడుంగాడి. బి. ఏ, నెల్లయు, కే. సారంగపాణి అయ్యంగారు, రిటైర్డు పోలీసు ఇన్స్పెక్టరు & మిరాసీదారు, మద్రాసు. టి. యం. వారిజాక్షన్, నెల్లయు; రాజన్ మెడికల్ హాల్, పరమకుడి; అర్. పెరుమాళ్ల నాయుడుగారు, కుంభకోణం; బాలు బ్రదర్స్ మద్రాసు, డ్రగ్ స్టోర్స్, కుంభకోణం, (తంతి.) నవ ఇండియా, కోయంబత్తూరు (తంతి) మెడికల్ స్టోర్స్ తిరునెల్వేలి, (తంతి) యునైటెడ్ ట్రేడింగ్ కో, కొలంబో (తంతి) సుందరమూర్తి బ్రదర్స్, పాండుచ్చేరి, (తంతి) పి. వాసవ మీనన్, (తంతి) పాలఘాట్, (తంతి) యం యస్ పాత్రుడు, విశాఖపట్నము. (తంతి) సి. హరిహరన్, మధుర. (తంతి) నటరాజ డిస్పెన్సరీ, చిదంబరం. (తంతి) సి జి. శాస్త్రి, బెంగుళూరు. (తంతి) ఆంధ్ర శేషగిరిరావుగారు, ఆరోగ్యసుధ సంపాదకులు, మద్రాసు. లోకనాధన్ గారు ల్యాండ్ లార్డు & గవర్నమెంటు కంట్రాక్టరు, మద్రాసు. కే. ఆర్. కృష్ణయ్యర్, మానేజింగ్ ఏజంట్స్ టి. స్టేన్స్ అండుకో, కోయంబత్తూరు. కోట విశ్వనాథంగారు, వంగోలు. వైద్యరత్న కెప్టన్. జి. శ్రీనివాసమూర్తి బి ఏ. బి. యల్. యం. బి. & సి. యం. మద్రాసు. నేమ్‌చంద్ ఖేమ్ చంద్ అండు కంపెనీ, బొంబాయి. డా. ఆర్. శ్రీనివాసన్ ఎమ్. డి. ఎమ్ యస్. హెచ్. ప్రొప్రయిటర్. శాంత మెడికల్ స్టోర్స్, ఎట్టియాపురం, ఆయుర్వేద భూషణ పండిత నోరి రామమూర్తిశాస్త్రిగారు, ఏ. కె. ఏ. సి. ప్రొప్రయిటర్, ఆయుర్వేదనిలయం, బెజవాడ. బి. వి. కృష్ణారావుగారు, ఎం. ఏ. బి. యల్. యండోమెంట్స్ స్పెషల్ ఆఫీసర్ ఖైరాతాబాద్ హైదరబాద్, దక్కన్, విస్సారాజ గోపాలరావుగారు బి. ఏ. బి. ఎల్. నెల్లూరు. దీపక్ ట్రేడింగ్ కార్పొరేషన్, బొంబాయి. సీతారామ జనరల్ ఏజన్సీస్ బొంబాయి కార్యాలయపు సిబ్బంది, బొంబాయి; సైనామహమ్మద్ అండ్ సన్సు లిమిటెడ్ వారి కులాలంపూర్ (మలయా) ఆఫీసు డైరెక్టర్. అదే కంపెనీవారి పెనాంగ్ ఆఫీసు డైరక్టర్. డా. యు. కృష్ణారావుగారు, ఎం. బి. బి. యస్. మాజీ మద్రాసు కార్పొరేషన్ మేయర్, మద్రాసు. శ్రీ కే. జి. మీనన్ ఐ. సి. యస్. చీఫ్ శక్రటరీ కొచ్చిన్ ట్రావెన్కూర్ యూనియన్ స్టేట్, తిరువేంద్రం, వారిధర్మపత్ని.

——(o)——



శీతారామా జనరల్ స్టోర్స్ ప్రొప్రయిటర్లు శ్రీరాం భీమశంకరరావు,

సీతాపతిరావుగార్లు

# శ్రీ కేసరిగారి కర్పించిన వినతిపత్రం



డాక్టరు కే. యస్. కేసరిగారూ,

ఈ స్వర్ణోత్సవ సందర్భమున యాభై సంవత్సరముల క్రిందట కేసరికుటీరమును, మీరు స్థాపించితి రనియు కొద్దిలో ప్రారంభమై అది దినదినాభివృద్ధిచెంది ప్రస్తుతపు ఉన్నతస్థితికి వచ్చుట తాము చూడ గల్గితిరనియు స్మరించుట చాల సంతోషకరముగానున్నది. ఇదేసందర్భమున మీ విజయవంతమైన కృషికి మా హృదయపూర్వకమైన అభినందనములను తెలుపుచున్నాము. మీరు మొదట కేసరీ కుటీరం స్థాపించి నారు; దాని వృద్ధికై పాటుపడినారు; అది యీనాడు భారతదేశమునందేగాక యితరదేశాలలో కూడ వ్యాపించి ప్రఖ్యాతి నొందుటను మీరు చూడకలిగినారు.

మీ పేరుకు తగినట్లు మానవులలో నిజముగా సింహము వంటివారు. మీదెంత ఉదాత్త జీవితము! మీరు ముఖ్యముగా లోధ్ర, అమృత, అర్క దివ్య ఔషధములను బ్రసాదించి వ్యాధిగ్రస్థమగు ప్రజానీకా నికి ఆరోగ్యమును ప్రసాదించినారు. ఇవి మీవిజయవంతమైన జీవితములో చిరస్మరణీయమైనవి. మీతో బాటు 20 సంవత్సరములనుండి మీ డిస్ట్రిబ్యూటర్లుగా మానవసేవ చేయగల్గుట మాకుచాల అదృష్టము.

మీరు బెజవాడలో కార్ఖానా స్థాపించినప్పుడు మాకు మీతో సంబధము ఎక్కువ సన్నిహితము గాను, గాఢముగను ఏర్పడినది. మీరు బెజవాడలోనుండగా మీరు చెప్పుచుండిన అనుభవ పూర్వకమైన హితవచనములను మరువజాలకున్నాము.

మీరువైద్యమునందు ప్రవీణులేకాక నారీలోకమునకు అమోఘమైన సేవచేసినారు. తమ లోధ్ర స్త్రీలకు వరప్రసాదములాంటిది. తమ గృహలక్ష్మి మాసపత్రిక స్త్రీలకు విజ్ఞానము ప్రసాదించుటయేగాక వారిని ఆదర్శ గృహిణులుగాను, విద్యావతులుగాను చేయుచున్నది. తమజీవితానుభవములను—తమప్రయ త్నములు, అందలి కష్టసుఖములు, తమబుద్ధి చాతుర్యములను తెలుపు "చిన్ననాటి ముచ్చట్లను" ఎవరు మరువగలరు ?

మీఉదారస్వభావము ప్రతిఫలింపజేయునవి మీరు ధర్మసంస్థలకు యిచ్చిన విరాళములే. తమ విజ్ఞానాభివృద్ధిపైగల ఆసక్తిని తమ వితరణశీలమును తెలుపుటకు కేసరి హైస్కూలు, కేసరి కన్యా విద్యాలయం, కేసరి ఎలిమెంటరీస్కూలు, (త్యాగరాయనగరు,) లను స్థాపించి పోషించుటయు గృహ లక్ష్మి కంకణమును శాశ్వతముగా నిచ్చునట్లు నిధిఏర్పాటు చేయుటయు తార్కాణములు.

ఈసంతోషకరమైన సమయమున కేసరికుటీరం భవనపు రజితమూర్తిని తమ ఆదర్శప్రాయమైన జీవితమునెడల, తముచేస్థాపింపబడిన సంస్థలయెడల గౌరవప్రేమ సూచకముగా తమకు సమర్పింప అనుజ్ఞనిండు.

భగవంతుడు తమకు సంపూర్ణారోగ్యమును ప్రసాదించి దీర్ఘాయుష్మంతునిగా చేసి యింకా అనేకసంవత్సరములు యిట్టిఉత్సవములలో పాల్గొనుట కవకాశము కల్గించుగాక.

———o———

# ఇంటిపనులలో మెళుకువలు

## జేబుదొంగలు!

"దొంగలున్నారు జాగ్రత్త" అని రైలుపెట్టెలలో వ్రాసి ఉన్నారు. కొన్ని ఇండ్లలో చొక్కాలు తగిలించే వంకెలపై "జేబుదొంగ లున్నారు జాగ్రత్త!" అని వ్రాయవలసి ఉన్నది. ఈ జేబు దొంగలెవరో కాదు; ఆయా గృహలక్ష్ములే !

కొందరు గృహక్ష్ములకు భర్తలజేబులలోనుంచి పావలా అర్ధతీసి జాగ్రత్త చేయడమనే దురలవాటున్నదని మాపాఠకులంతా అంగీకరిస్తారు. ఆవిధముగా భర్తజేబులో చేయిపెట్టదగినంత చనువు, స్వతంత్రం భార్యకు లేకపోలేదు. పైగా ఈ జాగ్రత్త చేసిన చిల్లరను వారు విశేషంగా దుర్వినియోగం చేయరు. పిన్నులకు, రిబ్బన్లకు, దువ్వెనలకునే ఖర్చుచేస్తారు. భర్త ఏ నెలాఖరులోనో చేతిలో డబ్బులేక బాధపడే టప్పుడు, కొద్దిక్షమాపణ వాక్యాలతో కూడా, ఈ కూడబెట్టిన ధనాన్ని వారిచేతిలో పోయడమున్న అట్టి గృహలక్ష్ములకు అలవాటే. తత్కాలపు అవసరానికి, అక్కరకు వచ్చినందుకు భర్త కొంత అభినందించినా "జేబుదొంగతనం" చేసినందుకు కొద్దిగా మందలించకపోడు.

అంతేకాదు; భర్త మనస్సులో ఈ విషయం దృఢంగా నాటుకొనిపోతుంది. మధ్యతరగతి కుటుంబాలలో వేతనాలు వచ్చిన తర్వాత నాల్గురోజులపైన నిలువఉండదు. ఇంటిఅద్దెవాడు, పాలవాడు, దాసీ, కట్టెలవాడు, అంగడివాడు-వీరంతా ముప్పాతికకుపైన లాగివేస్తారు. భార్యామణి, తన అవసరములు, పిల్లల అవసరములు, కొన్నిడిమాండులు గతమాసంలోనుంచి తయారుచేసుకొని ఉంటుంది. దానికి దీనికి ఖర్చుకాగా మిగిలేది చిల్లరే. ఈ చిల్లరలోనే జేబు దొంగతనాలు జరిగేది. ఖర్చు అయినది యజమాని ప్రతిదీ జ్ఞాపకం ఉంచుకోలేకపోవచ్చు; ఆఫీసులో కోటు తగిల్చినప్పుడు ఏ 'ఆఫీసుబాయ్' అయినా యజమానియందుండే చనువుకొద్దీ - 'కాఫీడబ్బులు' చెప్పకుండానే కాజేయవచ్చు. కాని ఈలెఖలేని ఖర్చుల మొత్తం అంతా తన గృహిణి తీసినట్టే అతడు భావిస్తాడు. అది దుర్మార్గం అనకండి. అతనికా అనుమానం కలిగించిందెవరు? కాస్తకోపధారివాడైతే నాలుగు కేకలేస్తాడు; లేకపోతే లోలోపల గుద్దుకుంటాడు. కాని ఆ అనుమానం మాత్రం అతనిని పెనుభూతం అయి పీకుతూనే ఉంటుంది. గట్టిగా గద్దించినప్పుడు "నేనేమి; దాచిపెట్టి కాసులపేరు చేయించికొన్నానా? ఇరుకుదరుకులలో మీకే యిస్తుంటినే." అనిభార్య మూతిముడిచి కళ్లనీళ్లు పెట్టుకోవడంకూడా కద్దు. అయితే అట్టి అనుమానం కలిగించడం మాత్రం ఆమెకు క్షేమమా? తన ఉద్దేశం నెరవేరడానికి తన భర్తకు అనుమానం కలుగకుండా ఉండడానికి, ఉత్తమ పద్ధతిని భర్తకు తోడ్పడే ఉపాయం ఒకటిచెప్తాను; అట్లాచేయవచ్చును.

హుండీ పద్ధతి నవలంబించు. కమ్మని ఫలహారము చేసిపెట్టినప్పుడో, గుమ్మని సువాసన వచ్చే పూలు తురుముకొన్నపుడో, బిడ్డలతో ముద్దులాడునప్పుడో నీ భర్తను మురిపించి మొగమాటపెట్టి హుండీలో చిల్లరలు వేయిస్తూఉండు - ఆ విధంగా వసూలైనదానిని అప్పుడప్పుడు వినియోగించవచ్చు. ఆ నిలువలను నీ స్వంతఖర్చు కుపయోగించుకున్నా నీ భర్త సహిస్తాడు; సంతోషిస్తాడు. నీవుచేసేపనిలో ఉద్దేశం తప్పుగాదు. ప్రభుత్వంవారు నేడు ప్రచారంచేసే "చిల్లరలు కూడబెట్టుకొనుడు" (Small saving certificates) యను విధానము వంటిదే. అయితే ఆ సదుద్దేశాన్ని "జేబుగొట్టి" ఆచరణలో పెట్టకు; అది నీకు, నీ భర్తకు, నీ బిడ్డలకు నైతికపతనం !





## గోంగూరపువ్వు పచ్చడి

గింజలుతీసివేసిన గోంగూరపువ్వు 5 పౌనులు, 2 పౌనులు ద్రాక్షపండ్లు, 4 ఔన్సులు అల్లము 2 ఔన్సుల మిరపపండ్లు 4 ఔన్సులు శుభ్రపరచిన వెల్లుల్లిపాయరేఖలు, 4 ఔన్సుల తెల్లఉప్పు లేదా బజారు ఉప్పు 1 టీ గరిటెడు మిరియాలు 4 అంగుళముల పొడవుదాల్చినచెక్క, 12 లవంగాలు, 8 యాలకాయల లోని గింజలు, 2 పౌనుల బ్రవున్ చక్కెర కావలయును. ద్రాక్షపండ్లు, చక్కెరతప్ప, కడమ వస్తువులన్నియును మెత్తగానూరి, గోంగూర పువ్వుకూడ దానితోకలిపి నూరవలయును. ద్రాక్షపండ్లను శుభ్రపరచి, నూరిన దానితో బాగుగాకలిపి, చక్కెరకూడకలిపి, గాలిచొరని బుడ్లలోగాని జాడిలోగాని ఒకవారము దినములు మగ్గనిచ్చి, పిమ్మట వాడుకొనవలయును.

## గోంగూర అన్నము

కాడలుతీసివేసి సన్నగా తరిగినటువంటి యిరువదినాలుగు తులముల గోంగూరను, ఒకశేరునీళ్ళు పట్టు పాత్రలో సుమారు అర్ధశేరు నీళ్ళుపోసి, పొయ్యిమీద కాగుచుండగా వేయవలెను. పావుతులము ఉప్పును ఆకుకూరలో వేసి రెండుపాళ్ళు ఉడికినపిమ్మట వడియకట్టి నీరుపిండవలెను. ఎనిమిదితులముల మినపప్పును ఒక కళాయిపాత్రలో కొద్దిగా నెయ్యియుంచి వేయించి రోటిలోవేసి పొడిగాదంచి తీయవలెను. రెండు తులముల ధనియాలు, రెండుతులముల ఎరపకాయలు, అరతులము మిరియాలు, పావలాఎత్తు జీలకర్ర, అరతులము జాజికాయ, అరతులము జాపత్రి పావలాఎత్తు లవంగాలు. పదితులముల నెయ్యి, యీపదార్థము లన్నిటిని వేడిగా వేయించి రోటిలో వేసి పొడికొట్టవలెను. 12 తులములు కొబ్బరికోరును వేయవలెను. వీటన్నిటిని సిద్ధముచేసుకొని, పావుశేరు బియ్యమును అన్నము వండి ఆఅన్నములో తయారైన పొడిలో సగంభాగమువేసి, మిగతాయున్న గోంగూరలో కలుపవలెను. రెండుశేర్లుపట్టు కళాయిపాత్రలో తిరుగుబోత చేసుకొని, గోంగూర అన్నమును వేసి గరిటికాడతో బాగుగా కలిపి నాలుగు నిమిషములు నిప్పులమీద యుంచి దించుకోవలెను.

## గోంగూర నూనెకూర

మనకు సరిపడినంత గోంగూరతీసుకొని కాడలు మొదలైనవి వేరి శుభ్రముచేసుకుని, సన్నగా తరిగి యుంచుకొనవలయును. ఒక యినుపకళాయిలో తగుమాత్రము నువ్వులనూనె వేసి పొయ్యిమీద యుంచ వలెను. తగుమాత్రము ఉప్పు, ఎండుమిరపకాయలు, రోటిలోవేసి మెత్తగా దంచవలెను. తరువాత ఉల్లి కొంచెము జీలకర్ర దంచి తీయవలెను. సన్నగా తరిగినటువంటి గోంగూరతో కలుపవలెను. పొయ్యిపై వుంచిన కళాయిలో కొంచెము మినపప్పు, నాలుగు యెండుమిరపకాయలు, నాలుగు చిన్నవుల్లిరెబ్బలు, వేసి బాగా వేగిన తదుపరి కొంచెము ఆవాలు కరివేపాకు వేసి తిరుగుబోత పక్వమైన తదుపరి తరిగియుంచిన గోంగూరవేసి బాగా కలిపి మూతవుంచవలెను. కొంచెముసేపు మగ్గనిచ్చి తరువాత దోశెరేకుతో కలుపుతు వేయించవలెను. గోంగూర బాగా నూనెపట్టి వేగిందాక వేయించి దించుకొనవలెను. ఆరోజుకన్నా మరు సటిదినము చాలా రుచిగా వుండును. యీ విధముగా చేసిన కూర వారముదినములదాక చెడిపోదు.

## గోంగూర రెండవ విధము

నలుబది యెనిమిది తులముల గోంగూరను నీళ్లలో కడిగి సన్నగా తరిగి యుంచవలెను. ఒక కళాయి పాత్రను పొయ్యిమీద పెట్టి నాలుగుతులముల మంచినూనెను కాచవలెను. కాగుచున్నప్పుడు ఒకతులము తొడిమెలుదీసి త్రుంచిన మిరపకాయలను వేయవలెను. రెండుపాళ్లు వేగినపిమ్మట నాలుగుతులములు శనగపప్పు వేయవలెను. ఇవి రెండుభాగములు వేగినపిమ్మట నాలుగుతులముల మినపప్పునువేసి తిరుగబోత పక్వమయిన వెంటనే తరిగిన గోంగూర ఆకును వేసి తిరుగబోతతో కలుపవలెను. కొంచెము కొంచెము నీళ్లుచల్లి కలియబెట్టి మూతయుంచవలెను. కూర అర్ధభాగము వుడికినప్పుడు ఉడికినపప్పు నాలుగు గరిటెలు వేయవలెను. రెండుతులముల చింతపండును ఒకకళాయి పాత్రలోవేసి అర్ధశేరు మంచినీళ్ళను పోసి, బాగుగా పిసుకవలెను. చింతపండులోని గింజలు కాడలుతీసి ఆగుజ్జును కూరలోపోసి గరిటె కాడతో చక్కగా కలిపి, ఒకతులమున్నర ఉప్పు, ఒకతులము కూరపిండి వేసి, కలిపి దింపవలెను. తరువాత అరతులము కొబ్బరి కోరు, కూరమీద చల్లి మూతపెట్టవలెను.

వాశిరెడ్డి విజయ సుశీలాదేవి.

———(o)———




అవిశెపువ్వు :-సర్వసాధారణముగ గృహావరణములలో అవిశెచెట్లు కానుపించును. అవిశె పువ్వులు చూచుటకు అందముగా చంద్రవంకలవలె తెల్లగా నుండును.

వీనిని పప్పులో వేయుదురు. పులుసుకూరగ చేసికొందురు. వాతహారము, శరీరపు బరువును తగ్గించును. ఉదరసంబంధమయిన నొప్పులకు అప్పటి కప్పుడు ఉపయోగించును.

అవిశెపువ్వుల రసముతీసి వడియగట్టి ఉన్మాదులకు, నాశికారంధ్రములు బిగించి ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఆడనివారికి దిండుమీద జారుగ తలనుంచి ముక్కురంధ్రములలో పిండిన మంచిగుణమిచ్చును. ముక్కులోగల దుర్గంధ యుత మయిన నీరువెడలుటనిలుచును. నొప్పిహరించును, తలభారము, నొప్పిశాంతించును.

తంగేడు :-పొలములలో, కంచెలలో సామాన్యముగ కానుపించును. పువ్వులు పచ్చగ గుత్తులు, గుత్తులుగ నుండును. పొలములలో పనిచేయు స్త్రీలు అలంకారముగ తలలో కూడ పెట్టుకొందురు. ఎండబెట్టి పిండిగకొట్టి గ్రామాదులలో పిల్లలకు శీకాయి కుంకుడుకాయలకు బదులు దీనినే వాడుదురు. వారివెంట్రుకలు నల్లగ నుండును. సామాన్యముగ తెల్లబడవు.

గ్రామాదులలో గొబ్బి, సంక్రాంతి పండుగలకు సులభముగ లభించు పువ్వులలో నిది యొకటి.

| | | | |
|---|---|---|---|
| తంగేడుపూలు | 10 | తు | |
| కరక్కాయ బెరడు | 2½ | తు | |
| తానికాయ | 2½ | తు | |
| ఉశిరికపప్పు | 2½ | తు | |
| శీకాయవిత్తులు | 1 | తు | వేయించినవి. |

వీటినన్నిటిని తగువిధమున ఎండలో బెట్టి బాగుచేసి దోరగావేయించి కాఫీ పొడరు మాదిరిగ చేసికొని కాఫివలె ఉదయమున త్రాగిన మధుమేహ ములు, మలమూత్రములో చక్కెర వున్నదను సందేహము పోవును.

# బ్రతుకు తెరువు

—(౦)—

వేపపూతనుగూర్చి గతసంచికలో చెప్పియున్నాను. అది శాకపాకముగాను, ఓషధి ద్రవ్యముగాను పలువిధముల ఉపయోగించునని చెప్పియున్నాను.

## వేపపండ్లు - వేపవిత్తులు

వేపపూత కాయకాచి పండ్లుపండును. ఆ పండ్లను తరచుగా కాకులుతిని విత్తనములను చెట్టుక్రింది నుమియుచున్నవి. వేపచేదైనా వేపపండులో చేదువిరిగిన మాధుర్యముండును. పల్లెటూళ్లలో గొడ్లకాపరులు మున్నగు పేదబాలురు ఈ వేపపండ్లను తినుచుందురు.

ఎవ్వరు వానిని చూడకున్నను ఆ వేపపండ్లు కాలక్రమమున ముదరపండి తొడిమ ఊడి క్రిందపడగా ఆ మాధుర్యమునకు ఈగలు, చీమలు, దోమలు చేరి కడుపునిండా తిని తిరుగుటకలదు.

వేపవిత్తులు పలువిధములుగా వైద్యమునకు పనికివచ్చును. ఈ విత్తనములలో నొక విధమగు చమురు గలదు. ఆ చమురుతీసి అనేక వ్యాధులకు మందుగా వాడుదురు. ముఖ్యముగా చర్మవ్యాధులకు పైపూతగాను లోనికిపుచ్చుకొనుటకును వాడుట కలదు.

ఇందుకై దేశవాళీ గానుగలుపయోగింతురు. చిన్నమిల్లులును గలవు. గృహపరిశ్రమగా రోటదంచి నూనెతీసికాచి యుంచుకొనుటయుగలదు. కడుపేదవారు దీనిని ప్రమిదలలోబోసి దీపము వెల్గించుకొందురు.

పండ్లు పండుకాలమున చెట్లక్రిందరాలిన కాయలను లేక విత్తనములను చీపురుతోచిమ్మి ప్రోగుచేసి పేదలు నూనెతీయువారికి రూపాయకిన్ని మానికలు, లేక తుంచములు అని కొలిచి అమ్ముదురు. ఎండాకాలమున రెండుమూడునెలలు పేదవారికిదియొక బ్రతుకుతెరువు.

వేపవిత్తనములను పాకకళలోను ఉపయోగింతురు. ముఖ్యముగా గోదావరి మండలములలో మాగాయఅను మామిడికాయ ఊరగాయను మజ్జిగలోకలిపి ఎర్రపాయలుతరిగి తిరుగబోత వేయుదురు. దానిలో వేపవిత్తులను సువాసన వచ్చునట్లువూడ్చి తిరుగబోతవేసిన చాల కమ్మదనమువచ్చును. అక్కడ గృహలక్ష్ములు సం॥నకు కావలసిన వేపవిత్తులను జాగ్రత్తచేసుకొందురు. వేప ఏవిధముననూ కడుపులోగల నులిపురుగులు మున్నగువానిని శోధించునది. రక్తమును పరిశుభ్రపరచునది. చర్మవ్యాధులను నిర్మూలించును.

ఈ ప్రకారమనేక విధముల బ్రతుకు తెరువునకుపయోగించు వేపవిత్తులను ఋతుకాలములో సేకరించుటయు నొకవిధమగు బ్రతుకుతెరువే.

---



---



ఢిల్లీలో ఆసియాఖండ వాసుల క్రీడా ప్రదర్శనములు జరిగినాయి. దాని నేర్పాటుచేసిన కమిటీకి 'పెప్సూ' రాష్ట్ర రాజ్యప్రముఖ్ శ్రీపాటియాలమహా రాజావారు. ఈక్రీడల ప్రారంభమునకు మున్నుడిగా ఆనాడాయన రేడియోలో ఈవిధంగా ప్రసంగించారు:-

ప్రపంచం సంఘర్షణలో మునిగి తేలుచున్నది. ఇలాంటి సమయంలో ప్రపంచవాసులంతా పరస్పర సహకారంతో శాంతిస్థాపనకై కృషిచేయవలసిన అవసరం ఉంది. నా అభిప్రాయంలో క్రీడారంగంలో అన్నివిభేదాలు పూర్తిగా సమసిపోతాయి. ప్రపంచ మంతటా క్రీడాపతాకం ఎగురవేస్తే, అదే ప్రపంచం నాలుగుమూలలకు శాంతిసందేశాన్ని గొంపోతుంది.

బొంబాయిలో ప్రభుత్వము వారేర్పచిన క్షీర కేంద్రంలో ఉపన్యసిస్తు పండిత జవహరిలాలు నెహ్రూ ఇట్లా అన్నాడు:-

చిన్నబిడ్డలకు చాలినంతపాలు ఇవ్వాలి. వారికివ్వను చాలినంత పాలులేకపోతే, పెద్దవాళ్లు వారి కొరకు పాలనుపయోగించుకోడం మానేయాలి.

బడ్జెట్ చర్చ సందర్భమున శ్రీమతి కుట్టుమాలు అమ్మాళ్ గారు ఇట్లు ప్రసంగించిరి:—

"శాసన సభ్యులకు, అచ్చువేసిన లెటర్ హెడ్ కాగితములమాట అట్లా ఉంచండి; మామూలు కాగితం పెన్సులుకూడా సప్లైచేయడంలేదు. ఏమికావాలన్నా ఒక చీటిపై చేవ్రాలు చేయాలి. ఈ ప్రకారంగా సభ్యులను కించపరచరాదు."

కేంద్ర వాణిజ్య - పరిశ్రమల మంత్రి శ్రీ హరికృష్ణ మెహతాబ్ యీ నెల రెండవతేదీ యీ క్రింది విధముగా పార్లమెంటులో ప్రకటించిరి:—

"దేశంలో నూలు, గుడ్డలకు ఏర్పడినకొరత ఒకటిరెండు నెలలలో చాలవరకు తగ్గిపోగలదు. ఇప్పుడు వాటి ఉత్పత్తి పెరుగుచున్నది. జూన్ నెలనాటికి రాష్ట్రప్రభుత్వాలన్నిటికి కావలసిన చీరలు, ధోవతులు సప్లయి చేయబడుతవి."

మాజీ మద్రాసు ప్రధాని శ్రీ టంగుటూరు ప్రకాశంపంతులుగారు విజయ వాడలో 2-వ తేదీన యీ విధముగా చెప్పిరి:—

"మంత్రులపై ఆరోపణల సందర్భములో నాచర్యను విమర్శించుచూ అఖిల భారత కాంగ్రెసు కార్య వర్గంవారు చేసిన తీర్మానమునకు, నేనిచ్చిన లాయరు నోటీసుకు సమాధానం రాగానే అవసరమయితే హైకోర్టుదాక వెళ్లి వ్యవహారము నడుపుతాను."

పాకిస్థాన్ ఇండియాలమధ్య జరిగిన ఒడంబడిక ప్రకారము అపహృత స్త్రీలను వెదకుటకు ఏర్పడిన అన్వేషణ మండలి నివేదికలో యిట్లు ప్రకటింపబడినది:—

“మార్చి 15-వ తేదినాటికి పశ్చిమ బెంగాలునందు హిందువులచే నపహరింపబడిన ముస్లిము స్త్రీలు ఎవ్వరూ లేరు.”

లేడీ యం. సి. టి. ముత్తయ్య చెట్టియార్ బాలికల ఉన్నత పాఠశాల స్కూలుడే సందర్భమున జస్టిస్ బషీర్ అహమద్ సయ్యద్‌గారు బాలికల విద్యావశ్యకతను గురించి ఇట్లు ప్రసంగించిరి:—

బాలికలు విద్యావతులైననేకాని బిడ్డలను బాగుగా పెంచలేరు. బాలబాలికల విద్యాభివృద్ధి విషయమును వితరణశీలురు పూనుకొనవలెను. అప్పుడే విద్యాసంస్థలు అనేకము ఏర్పడుటయును, విద్యాసంస్థలు వ్యాపించుటకును అవకాశము కలదు.

# ఖరా! శుభంకరా



డి. సరస్వతి.

సహకార శాఖరాజాస్థానపికములు
జయవాదధ్వానముల్ సలుపుచుండ
మధుర సంబాని మై మఱచిన మధుపాళి
స్వాగతగీతికల్ బాడుచుండ
తరుణ పల్లవరాజి విరులతో నొప్పిన
తరువ్రాజి సొబగుమై తనరుచుండ
కలకలారవములు చెలువారు శుకములు
సేసప్రాలిడి, ప్రీతి, జేరబిలువ

వికృతివర్షానఁ గలిగిన వికృతులెల్ల
పారద్రోలంగ, వెనువెంట పర్వులిడుచు
వచ్చుచుండెడి "ఖరనామ వర్షరాజ"
స్వాగతంబిదె నీకు, సుస్వాగతంబు.

ఆంధ్ర "గృహలక్ష్మి" బృంద మాహ్లాదముగను
బారులన్ దీర్చి పాటలు పాడుకొంచు
కాచియున్నారు నీకు నుగాదినాడు
మంగళారతులిడ "ఖరా" రంగుమీర.

కడచినవత్సరంబు, కడ గండ్లకులోనయి తిండిబట్ట లే
కడరిన యాంధ్రజాతికి, సు ఖంబిక లేదనిపించి కాటకం
బడుగిడఁ జేసిపోయె నిక నైనను నీశుభవీక్షణాల నీ
పుడమిని, బర్వజేయుమిదె మ్రొక్కెదనుంటి "ఖరా! శుభంకరా!"

తెలుఁగులు సర్వతోముఖ ప్రదీప్తివహించుచు, గౌరవంబుతో
మెలగిరి పూర్వకాలమున మేటిగనాయకు లుండిగూడ
నేడలబలమాయె జాతియు, న నైక్యతకారణమావహించి, మా
కలతలు దీర్చిరాష్ట్రమును కల్గగనిమ్ము "ఖరా! శుభంకరా!"

“తినుటకు తిండిలేదు, మఱి తిన్నగనుండుట కిల్లులేదు, మా
తనవులఁ గప్పికొంటకొక తంపర పీలిక లేక పోయెనే ”
యనుచు కృశించు, బీదప్రజ లారడిమాన్పగ, జేసి, నీవు నీ
యనుపమకీర్తి లోకముల సంతట, దెల్పు “ ఖరా! శుభంకరా! ”

“ఖరనామ వత్సరాధిప”
ఖరకిరణుని రీతి కాట కాదులనెల్లన్
సరగున మానిపి, శోభా
కరుఁడవు కాఁగోరి తలతు కడునిష్ఠమెయిన్.

మత వైషమ్యముమాన్పి, మానవుల, సౌభ్రాతృత్వమున్నిల్పి,
తత సమ్మోదములిచ్చి, స్వర్ణయుగమున్ స్థాపించి, యారోగ్య భా
గ్యతతుల్ గల్గగ, జేసి, నీతిబల, శౌర్యాధిక్యతన్ గూర్చి, సం
తతి వర్ధిల్లగ, జేయుమీ, తెనుఁగుమాతా! తెన్గువర్షాదిలోన్.

—— o ——

# శ్రీ ఖరనామ సంవత్సరం గృహలక్ష్మి పంచాంగ శ్రవణం

6-4-51 తో వికృతినామ సంవత్సరం గతించినది. 7-4-51 ఖరనామ సంవత్సరం ప్రారంభమైనది. ఉగాది పండుగనాడు గృహలక్ష్మి అభ్యంగనస్నానమొనర్చి, ఇంటిల్లిపాదికి తలయంటిపోయగా అందరు నూతన వస్త్రవిభూషణాలంకృతులైరి. అంత నామెకలయంతలో, మరునాటినుండి మరియొకజొన్న బియ్యము రేషన్ హెచ్చుచున్నదనే సంతోషాతిశయంతో, పప్పు పాయసములు, పిండివంటలుమున్నగు వానితోసహా ధాన్యేతరవంటకములను విస్తారముగావించి, క్రొత్త చింతపండు, పుట్టతేనె, అరటిపండు, మామిడిముక్కలు, చెరకుగడముక్కలుకలిపి వేపచేదుచేసి, ఎల్లరిని తృప్తిగా భుజింపజేసి తాంబూలచర్వణ మొనర్చుచు, భర్తతోడను, పుత్రీ పుత్రులతోడను సుఖాసీనురాలై తాళవృంతమున మెల్లన భర్తకును తనకును గాలితగుల మెల్లన వీచుకొనుచు కొలువుతీరి యుండగా - చందన పుష్పతాంబూలాద్యర్చితుడై గృహలక్ష్మి సిద్ధాంతి ఈ విధిగా పంచాంగ శ్రవణము గావించెను:—

గృహలక్ష్మి సిద్ధాంతి పద్మాసనస్థుడై కూర్చుండి కండ్లజోడు తగుల్చుకొని ఒద్దుగానస్యముపీల్చి, కీచ గుడ్డతో ముక్కు తుడుచుకొని పూజింపబడిన క్రొత్త పంచాంగంబుచేపట్టి బట్టతల తుడుచుకొనుచు ముక్కుపై ఇంచుకజారిన కండ్లజోడు పైనుండి కనుబొమలెత్తి సాభిప్రాయముగాచూచుచు గొంతెత్తి—

"శ్రీ కళ్యాణగుణా వహాం రిపుహరం ..."

ఇత్యాది పంచాంగ శ్రవణ ఫలిత శ్లోకముల పఠించి ఇట్లు చెప్పం దొడంగె:—

ఇప్పటికి సృష్ట్యాది గడచిన సం॥లు : 195, 58, 85, 152.

కలియుగంలో గతించినవి : 5052.

శాలివాహనశకగతములు : 1873.

విక్రమశకము : 2007.

హూణశకము : 1951-52

వికృతి సం॥ అనంతరం వచ్చినది ఖరనామ సం॥ము.

ఈ సంవత్సరంలో గ్రహాల పరిపాలకా వర్గం ఈ విధంగా ఉంటూన్నది:—

| | | |
|---|---|---|
| రాజు : శని | అర్ఘాధిపతి : శుక్రుడు | స్థానసంరక్షకుడు- గోపాలుడు. |
| మంత్రి : శని | మేఘాధిపతి : శుక్రుడు | పూర్వ సస్యాధిపతి-శుక్రుడు. |
| సేనాధిపతి : శుక్రుడు | రసాధిపతి : గురుడు | మధ్య సస్యాధిపతి - శుక్రుడు. |
| సస్యాధిపతి : కుజుడు | నీరసాధిపతి : చంద్రుడు | అంత్య సస్యాధిపతి - రవి. |
| ధాన్యాధిపతి : రవి | పశుపాలకుడు : బలరాముడు | పురోహితుడు - చంద్రుడు. |

ఇంకా చిన్న చిన్న ఆధిపత్యాలన్ని తలావకటి చేపట్టినారు. పై 15 అధికారాలలో - 2 అధిపత్యాలు-శనికి, 5 ఆధిపత్యాలు శుక్రుడికి పట్టాయి. సూర్యచంద్రులకున్నూ 2 సి అధికారాలు. వీరిలో శనికుంటివాడు శుక్రుడు గ్రుడ్డివాడు; చంద్రుడు క్షయరోగి. రవికి అతిక్ష్ణత అయితేనేమి వారిదే మెజారిటీ అధికారదాహము !

అందులోను రాజు మంత్రికూడా శనేనట ! ఒకరిమాట వినడు.

ఇది స్థూలదృష్టికితోచే మాట. శాస్త్రకారుడేమంటాడంటే - ఖరనామ సం॥ మున పరిపాలకులంతా ఒకరొకరితో యుద్ధంచేసుకోవాలనే ఉత్సాహంతో ఉంటారు. వర్షం మధ్యమం. పరిపాలకులు గొప్ప రోగాలచే నాశనమవుతారు. రాజు మంత్రికూడా శశికావడంచేత - ప్రజలకు దొంగలవల్ల, అగ్ని, శస్త్రమువల్ల

భయం. (అంటే కమ్యూనిస్టుదాడులు మిక్కుటమవుతాయన్నమాట.) పంటలు తక్కువ. ప్రజలకు రోగాదిబాధ. జననష్టం. పశుపాలక స్థానసంరక్షకులు - బలరామ గోపాలకృష్ణులు కావడంచేత పాడిపంటలకు కొంత వృద్ధికన్పిస్తున్నది. అయితే పాలవాళ్లు నీళ్లలో పాలుపోయడం మానుతారా?

పుష్య బ 2 సోమవారంనాడు సాయంకాలం గం 5-13 లకు మకరసంక్రాంతి. ముసలీ, ముతకా ఆచారవంతులు ఆనాడు పుణ్యకాలంవచ్చేదాకా గంగపుచ్చుకోరు. వారి పాలిటి కాకోలు పండగ ఎండగే. (సంక్రాంతి పురుషలక్షణాలు సంక్రాంతి సంచికలో వివరింపబడతాయి.)

## మూఢమి

శ్రావణ బ 13 (30-8-51) మొదలు భాద్రపద శు 8 (9-9-51) వరకు పశ్చాద్దస్తమిత శుక్ర మౌఢ్యము.

## గ్రహణములు

భాద్రపదంలో (15-9-51) న సూక్ష్మదృశ్యాదృశ్యగ్రస్తోదయ చంద్రగ్రహణము. మాఘమాసంలో (10-2-52) న మరో చంద్రగ్రహణం. మాఘమాసంలోనే (25-2-52) ఒక సూర్యగ్రహణం.

మొదటి చంద్రగ్రహణంవల్ల - వైశ్యశూద్రమ్లేచ్ఛులకు నష్టమట; కళింగవంగ సౌవీరసౌరాష్ట్ర మ్లేచ్ఛ దేశాలకు అరిష్టమట. ఇక రెండవ చంద్ర గ్రహణంవల్ల బ్రాహ్మణ ప్రభువులు; ఇంకా ఎక్కడనన్నా ఉంటే - వారికి నష్టం. రాజులకు అశుభం. యుద్ధం. ప్రజానష్టం. అనావృష్టి. సూర్యగ్రహణ ఫలితమునూ అట్టిదే.

## కందాయ ఫలాలు

రోహిణి, ఉత్తర పూ.షా, నక్షత్రాలకు ఆదిశూన్యం. కృత్తిక, ఆరుద్ర, ఆశ్లేష, ఉత్తర, స్వాతి, జ్యేష్ఠా, ఉత్తరాషాఢ, శతభిషం, రేవతి మధ్యశూన్యం. రోహిణి, ఆశ్లేష, హస్త, జ్యేష్ఠ, ధనిష్ట, నక్షత్రము లకు అంత్య శూన్యం.

## ఆదాయ వ్యయాలు

మిథునం, కన్యలవారికి ఆదాయంలో వ్యయం సగంకన్న తక్కువే; మకరం, కుంభాలవారికి అంతే. సింహంవారికి ఆదాయానికి దాదాపు రెండురెట్లు వ్యయం: ధనుర్మీనాలవారికి నాల్గురెట్లు వ్యయం. మిగతావారికి రెండూ సమానమే.

## ఖర సంవత్సర విశేషము

తెలుగు దేశానికి కర్షకులకు రెట్టమత శాస్త్రము ప్రమాణ గ్రంథము. అందులో ఈ సంవత్సరాన్ని గూర్చి ఇట్లా చెప్పబడినది:—

హర్షమొందు జనంబు ఖరాబ్దమునను పంటయువాన
తగుపాటి, పలుభీతి వికలమతు లౌదురనె రెట్టసుకవి....॥

భృగు సంహితయందు ఈ సంవత్సరంలో పుట్టేవారి లక్షణాలను ఇట్లా అని నిర్వచించారు:—

కఠోరచిత్తకో పుంసః । దీర్ఘస్వరసుభాషిణః ।
క్లేశకర్తానిర్లజ్జాచ । ఖరసంవత్సరోద్భవః॥

# ఉగాదిగేయం

సర్వజనంబుల
పర్వదినంబగు
నుగాదివచ్చె
నుల్లాసమిచ్చె.
చూతపత్రములు
ప్రీతితోగట్టి
రంగవల్లులు
రంగుగదీర్చి
పసుపుకుంకుమలు
బాగుగ దీర్చి
గేహము దిద్దుచు
గృహలక్ష్ములు దా
మలంకరించుక
నానందింపగ
వచ్చెనుగాది;
వచ్చెవసంతం.
నింబకుసుమముల
నింపుగదెచ్చి
మావిపిందెలు
మంచివిదెచ్చి
వేపప్రసాదం
వేడుకమీరగ
బాలబాలికలు
భక్షింపుచును
నూత్నవస్త్రములు
నూత్నోత్సాహము
వెల్లివిరియగా
వేడుకమీరగ
వచ్చెనుగాది;
వచ్చెవసంతం.
గండుకోయిలల
గానరవంబులు
మల్లెపువ్వుముల
మత్తువాసనలు
మరువకదెచ్చె
మలయానిలయములు
తలిరుటాకుల
తరువులశోభ
గాంచినకోలది
కనులపండువై
భావోద్వేగము
బర్వాలెత్తగా
కలముబూనినవ
కవులెల్లరును
కమ్మని కయితల
నిమ్ముగవ్రాసి
ప్రకృతివిలాసం
ప్రశంసింపగా
వచ్చెనుగాది;
వచ్చెవసంతం.
నవ్యవిలాసం
నవ్యోత్సాహం
నవ్యభావములు
నవ్యకవిత్వం
నవ్యాన్వేషణ
నవ్యమార్గములు
నవ్యవర్షమున
నవ్యఫలంబుల
నిచ్చెనుగాక
మెచ్చగునట్లు
వచ్చెనుగాది;
వచ్చెవసంతం.
అరమర లేని
ఐకమత్యమున
ఆంధ్రులెల్లరును
ఆదర్శంబుగ
ఆంధ్రతేజము
ఆంధ్రశౌర్యము
ఆంధ్రప్రతిభ
ఆంధ్రోత్సాహము
దీపింపంగా
దీక్షవహించి
ఆంధ్రరాష్ట్రమును
అవతరింపగా
ఊర్మిమీర కడు
కృషిసల్పగా
వచ్చెనుగాది;
వచ్చెవసంతం.

దేశిరాజు భారతీదేవి.

# శ్రీమతి మాధవి అమ్మగారి షష్టిపూర్త్యుత్సవం

కేసరి కుటీరమున కీమాసమురోజులుపైగా శుభపరంపరలు. మార్చి 3 వ తేదిన గృహలక్ష్మి స్వర్ణ కంకణ మహోత్సవము జరిగెను. 23, 24 తేదులలో కేసరికుటీరం స్వర్ణోత్సవములు జరిగినవి. ఏప్రెల్ 9-వ తేదిన శ్రీ కేసరిగారి రెండవ భార్య శ్రీమతి మాధవి అమ్మగారి షష్టిపూర్తి యుత్సవము కడువైభవముగా జరిగినది. అది వారి పుట్టింట తిరుచూరున, పుట్టింటివారి ఆచారానుసారం జరుపబడినది.

శ్రీ మాధవి అమ్మగారు పుట్టినరోజు చైత్రశుద్ధతదియ. ఆనాడు సోమవారం. మధుమాసమున పుట్టిన బిడ్డ యగుట కాబోలు ఆమె తలిదండ్రులు 'మాధవి' యని పేరు పెట్టుకొనిరి.

60 సం||లు ఆనందముగ, అనాయాసముగ గడపిన శ్రీ మాధవి అమ్మగారి షష్టిపూర్తి ఉత్సవమునకు బంధువులందరు తిరుచూరునకూడిరి. శ్రీ కేసరిగారును అస్వస్థులైనా ఓపికచేసుకొని వెళ్లిరి. ఆ రోజున తెల్లవారిఝామున శ్రీ కేసరిగారి రాజబంధువులు, వారి ఇల్లాండ్రు, ఇంక నితర బంధుమిత్రులగు ముత్తైదువులు అందరుకలిసి ఆదంపతులతోపాటు మంగళస్నానముల గావించిరి. తదుపరి ఆ పుణ్యదంపతులు దేశాచారానుసారము మంగళవస్తువులతో నలంకరించుకొని స్వగృహమగు మాధవీ మందిరమునకు చెంతనున్న మాధవాలయమునకు బంధుమిత్రులందరిని వెంటబెట్టుకొని వెళ్లిరి.

అచటి కళ్యాణ మంటపమునకు వీరందరు చేరునప్పటికి బ్రాహ్మణ బృందమును అచ్చట గుమికూడినది. మహావైభవముగ అలంకరింపబడిన ఆయుష్యహోమశాలయందు హోమాది వైదిక క్రియలు నెరవేర్చబడినవి. శ్రీ కేసరిగారు జరాభరితులయ్యు, సంతోషాతిశయమున మాధవునివలె ముసిముసి నగవుల వెదజల్లుతూ సుఖాశీనులైరి. శ్రీ మాధవి అమ్మగారి చుట్టును వారి పుట్టింటివారు, కొచ్చిన్ రాజకుటుంబము వారు, రాజకుమారులు, రాజకాంతలు సుమారు వందమందిదాకా కూర్చుండిరి.

ఈసందర్భమున ఇతర ప్రాంతీయులు, జరీవస్త్రములను, చీనీచీనాంబరములను వాడుదురు. స్వల్పముగా వస్త్రభూషణములను ధరించి సహజసౌందర్యము చేతనే గాంధీమహాత్మునిచేత మోహముగ్ధునొనర్చిన నారీమణులు పుట్టిన మళయాళదేశమున నిట్టి శుభసమయముల నిచ్చిపుచ్చుకొనువస్త్రము చిన్న కొల్లాయగుడ్డ లేక చదరపుగుడ్డ - దానినే పూర్వాచార సంపన్నులగు అత్తకోడండ్రు, మరదీమరదండ్రు ఒండొరుల కిచ్చి సత్కరించుకొందురు. ఆ చదరము ధరించి మున్ను, వారు వారు, ఏమేమి ఘనకార్యముల నొనర్చిరో, పాటలతో పద్యములతో సరససల్లాపములు గావించుకొనుచు వికవికల, పకపకల, పొంగిపొరలి ఉత్సవలోలురై ఆనందింతురు. మకుటము ధరించిన మహాప్రభువుకైనా, ఆ కొల్లాయమునే గౌరవపురస్సరముగనిచ్చి సత్కరించుటయు, ప్రేమపూర్వకముగా వారు స్వీకరించుటయు, అనునీఆచారము అగాధ గంభీరార్థకము. "కౌపీనవంతః ఖలు భాగ్యవంతః" అన్న నానుడిని వీరిట్లు ఆచరించి చూపుచున్నారేమో!

ఈకొల్లాయమును బంధువు లొండొరులు ఇచ్చిపుచ్చుకొనుటతో సరిపోలేదు. ఆమెకితోధిక ఆయురారోగ్యైశ్వర్యముల నాశించుచు, ఆమెను మధ్యనుంచుకొని వారిబంధువులు చిన్నలు, పెద్దలు దక్షిణ తాంబూల సహితముగా కొల్లాయములను బ్రాహ్మణులకు దానమొసంగిరి.

# ఆదర్శమిథునం

శ్రీ చీమలపాటి
సూర్యనారాయణరావుగారు

(ఫిబ్రవరి 1951 సంచిక తరువాయి)

ఒకమారతని ముఖంలోనికి సాభిప్రాయముగా జూచి, "నా సెలవు మాటేం జేసారు సార్ ?" అని ప్రశ్నించా.

"సరే - యెన్ని రోజులు సెలవు కావాలంటావ్ ? ఐదుదినములు సరిపోతుందా ?"

"చిత్తం - నా ప్రయాణమునకే చాలదు సార్ ?" అన్నా : నమ్రత ఉట్టిపడేలా.

"ఏమీ, కోనుక్కుంటావా ? యిక్కడున్న రాజమండ్రి వెళ్ళేందుకు, వచ్చేందుకూ, అయిదు రోజులు సరిపోవూ ? నువ్వెక్కడో విచిత్రం మనిషల్లే ఉన్నావయ్యా ?"

ఒక్కమారు వురిమాడు, అతని స్వరపేటికనుండి యావిర్భవించిన ధ్వనికి నిజంగా భయపడ్డాను ... నసుగుతూ నాకోర్కెను చెబుతే ఫలితాన్ని పొందవచ్చుననే యనుకున్నాను. కానీ ఆఫీసర్లదగ్గర నసిగితే, వ్యవహారం మొదటికే చెడియూరుకుంటుందని, ఓ నా B. E. స్నేహితుడు చెప్పటంవలన ధాటిగా "చిత్తం ... సరిపడదు సార్ - రానూపోనూ, ప్రయాణము రెండు రోజులుపోగా, మిగిలేది తక్కువ దినములు కాబట్టి యెక్కువరోజు లిప్పించమని కోరుతున్నాను ; వెళ్లేది అత్తారిల్లు. నేను మా పుట్టింటికి వెళితే, మీరిచ్చే ఐదుదినములు సరిపడును. ఆదరాబాదరాగా, వెళ్ళివచ్చేస్తే, పైగా విసుక్కుంటారు: పిల్లంటే (నాభార్య!) నాకభిమానంలేదని, ప్రేమ అంతగన్నాలేదని, వాడిచెల్లికిదేవిధంగా జ్వరమువస్తే వెంటనేవచ్చి వెళ్లిపోతాడా అని లేనిపోని నిష్ఠూర్యపు మాటలు పరోక్షంగా యనుకుంటారు. ఆ కారణంచేత యింకా ఎక్కువ సెలవు యిప్పించమని హృదయపూర్వకముగా ప్రాధేయపడుతున్నాను ; అధమం పదిహేనురోజులైనా యుండకపోతే, బాగుండదు. అదీగాక - నాకు శీగిరం వచ్చేందుకు మనస్కరించదుకూడా. అదీగాక తమకు 15 దినములవరకు కేంపునుండిరామని శలవిస్తున్నారు. తమరాఫీసులో యుంటేనేగాని నాకు వర్కు ఉండదు ; ఈ యాఫీసులో ప్రవేశించిన తరువాతిదే ప్రథమ పర్యాయం నేను సెలవు పెట్టడం అందుకు." అని - నసగసాగాను. నసుగుతే, యాఫీసర్లదగ్గర ప్రమాదమేనని నా స్నేహితుడు హితోపదేశంజేసినా, యిప్పుడు నాకు నసగడం - అనివార్యమైంది !

"పోనీ 15 రోజులైనా సరిపోతుందంటావా ?" అని అన్నాడు.

"Oh ! enough and to spare sir !" అన్నాను ఉత్సుకతతో ... అతను దేనినిగురించో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు ... అతని వాలకమునుబట్టిజూస్తే, 15 రోజులు కాదుగదా, అధమం అయిదు దినములైనా యివ్వనట్లు తోస్తూంది. నాకు చచ్చినంత యేడ్పువచ్చింది ... నావాలకమును కనిపెట్టిన మాయాఫీసరు,

"సరే, వెళ్లుబాబూ! యిక్కడ మాత్రం యేడవ్వొద్దు (నేనుయేడ్వలేదనుకోండి!) ... నాకో చాలా భయము!." అంటూ - కుర్చీలోంచి లేచాడు!

ఏడుపుముఖం పెట్టడమే నాకు మంచిదైంది. అటువంటి యూహ నాకు జనించినందుకు నన్ను నేనే యభినందించుకున్నాను మనస్సులో.

మా పొరుగింటికే, మా యావిడ స్నేహితురాలు 'జగదాంబ' నివశిస్తూంది. ఆమెదొక విషాద జీవితం. ఆమె తన యిరువదిరెండు సంవత్సరముల వర్తమాన జీవితంలోనూ - 'ఆనందం' యేవిధంగా ఉంటుందో రుచిజూచి యెరుగదంటే మీరు తప్పక యాశ్చర్యపడతారు.

జగదాంబ మంచి పేరుప్రఖ్యాతులు గడించిన, సంపన్న గృహస్థునింటిలోనే జన్మించింది. అయితే యేమిటిలాభం? తన తోబుట్టువుల మల్లే నేటివరకు తన వర్తమాన జీవితకాలంలో 'ఆనందం' యొక్క సారాన్ని యాస్వాదించలేదు; పుట్టుకష్టజీవి!!

ఇవతల పుట్టింటి వారివల్లనైతేనేమి, అవతల మెట్టినింటవారివల్లనైతేనేమి, యెటువంటి సుఖాన్ని యానందమును యనుభవించలేదు. ఇది జగదాంబ జాతక ప్రభావమో లేక విరించిలిఖితమో, కర్మానుభవమో యేది నిర్ణయించేందుకూ సాధ్యపడకుండా వుందంటే, ఆ పిల్ల కష్టాలెటువంటివో, మీరే యొక్క మారు వూహించుకోండి!

పుట్టింటలో నున్నంతకాలం యెటువంటి కష్టాలనుభవించిందో మనం వేలుమడిచి చెప్పలేం ... వివాహం అయింది. తన మేనల్లునకు మొదటిభార్య చనిపోయిందన్న కారణంచేత, యెక్కువ కట్నాలు పోసి జగదాంబకు అనుకూలుడైన భర్తను వెతికి కళ్యాణం జేసేందుకు బద్ధకంపడి, తన మేనల్లునకిస్తే పిల్ల సుఖపడుతుందని, తన మేనల్లుడు మంచితెలివైనవాడని, డబ్బున్నవ్యక్తని, జగదాంబను భైరవశాస్త్రికిచ్చి, తన చేతులతోనే నరకానికి జగదాంబకు తండ్రి దారి చూపించాడు.

నలభై సంవత్సరముల వయస్సులోనున్న భైరవశాస్త్రి యాదిలో జగదాంబ తండ్రిదగ్గరకుపోయి అతని కాళ్లమీదపడి 'మామయ్యా! - నాతొలిభార్య పోయిందన్న విషయం నీకు దెలిసిందే. ఆమె మరణానంతరం తిరిగి వివాహం జేసుకునేందుకు నాకు మనస్కరించలేదు. కానీ, యీ భూమ్మీద ఒక్క 'మగనలుసు'ను కని, విడిచిపుచ్చి తనదారి తాను జూసుకుంది. వాడి సంరక్షణ - పెంపకపు బాధ్యత అనివార్యముగా నామీదపడింది. నాకొడుకును పోషించటం, సంరక్షణ చేయటం; 'నిండుబండికి చేట బరువు గాద'న్నట్లు నాకుబరువుకాదు. నేను నిత్యము ఆఫీసుకు వెళ్లడం, అవసరంకలిగినపుడు భూముల మీదకుపోయి శిస్తులు వసూలుచేయటం వ్యవహారములను పరిష్కరించవలసిన, సమయము లప్పుడప్పుడూ వస్తూవుంటాయి. నేనప్పుడు తప్పనిసరిగ వెళ్ళకుండదప్పదు. అటువంటప్పుడు వీడిని చూచేదెవరు? యెవరికి అప్పజెప్పిపోదును? ఈ కరువుకాలంలో నిండుబండికి చేటే బరువౌతుంది. తల్లికి పిల్లే భారంగా యున్నప్పుడు నాబిడ్డను సంరక్షణ చేసేదెవరు?

అందుకు - నీకూతుర్ని నాకిచ్చి వివాహంజేసి, నన్నో యింటివానిగాజేసి, నాకుటుంబాన్ని నిలబెట్టు! నాకు మాత్రం - అట్టే పదిమందిలేరు. నీపిల్లను పువ్వులోపెట్టి పూజిస్తాను. నాకోర్కెను కాదని కాళ్ళతో తృణీకరించక, నెరవేర్చు."

(సశేషం)

కార్మికరక్షణ సౌకర్యాలూ, ప్రమాదాలురాకుండా ఏర్పాట్లూ, ఆరోగ్య సౌకర్యాలూ ఏర్పరచకుండా ఏఫ్యాక్టరీగాని, మిల్లుగాని పనిప్రారంభించడానికి అనుమతి యివ్వబడదు. అంటే గాలి, వెలుతురు, సౌకర్యాలూ, యంత్రాలవద్ద రక్షణకు తగిన ఏర్పాట్లూ, స్నానాలగదులూ, కార్మిక స్త్రీలకు విశ్రాంతిగదులూ వుండాలి. కార్మిక సంఘం ఇన్‌స్పెక్టర్లూ, ప్రత్యేక సాంకేతిక వుద్యోగులూ యీ ఏర్పాట్లను తణిఖీచేస్తూ వుంటారు.

సోవియట్ కార్మిక చట్టం, స్త్రీలు కష్టమైన అనారోగ్యకరమైనట్టి పనులు చేయకుండా నిషేధించింది.

(సోవియట్ యూనియన్ వార్తలు వ్యాఖ్యలు. 10-12.51)

[ఈ సంస్కరణలు చేయడానికి కమ్యూనిస్టు ప్రభుత్వమే ఏర్పడనక్కరలేదు అని తోస్తుంది. గృ॥ సం.]





# సాధ్వి

రచన: శ్రీమతి వంగల వాణీబాయి

(1951 ఫిబ్రవరి సంచిక తరువాయి)



## 2 వ భాగం

నరేంద్ర పిల్లల్ని చూచేందుకు ఆశ్రమానికి చాలా ఆలస్యంగా వెళ్లడంచేత, అక్కడి రూల్సు ప్రకారం అంతలేటుగా ఎవ్వరినీ చూడనివ్వమనీ ఉదయం 8. గంటలు మొదలు, మధ్యాహ్నం 12 గంటలవరకూ గాని తిరిగి మళ్లీ మధ్యాహ్నం 3 గంటల మొదలు 5 గంటలవరకూ గాని చూడవచ్చునని తెలియజేశారు. నరేంద్ర చాలా నిరాశతో ఇల్లుచేరుకున్నాడు. రాత్రి 9 గంటలైంది. అమ్మగారు ఇంకా రాలేదన్నారు నౌకర్లు. ఒంటరిగానే ఏదో భోంచేసి, పడకకు వెళ్లాడు. కాని నిద్ర పట్టితేగా! కొంచెం సేపటి తర్వాత ఏదో మగతగా నిద్రపట్టీపట్టనట్లుగానే, తెల్లవార్లూ, పిల్లల్ని గురించిన కలవరింతలే! భార్య ఎప్పుడు వచ్చి పడుకుందో కూడా తెలియదు. తెల్లవారలేచి కాఫీఫలహారాలు పుచ్చుకొని, ఎప్పుడు 8 అవుతుందా అని తయ్యారుగా గడియారంకేసి చూస్తూ కూర్చుని ఉండగా, అప్పుడే నిద్రలేచి తన పడకగదిలోకే ఆయాచేత కాఫీ తెప్పించుకొని త్రాగుచున్న సరోజ మగనిని ఒకసారి తనగదిలోకి రమ్మని కబురుచేసింది. నరేంద్ర వెళ్ళగానే, ఆయన నిన్న Races (గుర్రపు పందేలు) కి ఎందుకు రాలేదనీ, ఆయనకోసం తాను అక్కడవేచియున్నాననీ చెప్పి, ఇంకా - రాత్రంతా తన భర్త తెగ కలవరించడం వల్ల, అసలే పందేలలో ఓడిశ్రమపడి తాను నిద్రపోలేక పోతిననీ, ఇంకా ఏమేమో కబుర్లు కొంచెం సేపుచెప్పి, నిన్న “రేసెస్” లో 200 రూపాయిలు ఓడిపోవటం వల్ల, తనకు కొంత పైకం. చాలా అవసరమనీ దయచేసి ఇవ్వమనీ కోరింది. తాను ఇంకెప్పుడూ “రేసెస్” కి వెళ్ళనంది. కొన్నిచక్కని లాలనచేసే వాక్యాలు బల్కింది. డబ్బు కావల్సినప్పుడు కొంచెం బుజ్జగింపు మాటలు పల్కకపోతే, ఊర్కే వస్తుందా డబ్బుమరి? వారిక్కడ మాట్లాడు తూండగానే గడియారం ఎనిమిదిన్నర కొట్టింది. అయ్యో ఆలస్యమయిందే అనుకుంటూ గబిక్కున లేచాడు. ఎక్కడికంత తొందర? నాకుముందు డబ్బుయిచ్చి వెళ్ళండి అంది సరోజ. ఏమీ అనజాలక వెంటనే రెండువందల రూపాయిలకూ చెక్కువ్రాసి టేబిల్ మీద పడేసి తాను ఈసారి పెద్దకారే తీసుకు వెళ్లిపోయినాడు. నరేంద్ర అంత అవసరంగా వెళ్లిపోయినందుకూ, పెద్దకారు తనకోసం ఉంచకుండా తీసుకువెళ్లినందుకూ చాలాకోపం వచ్చింది సరోజకు. కాని ఏమీ అనలేకపోయింది.

నరేంద్ర అనాథాశ్రమానికి వచ్చాడు. పిల్లల పేర్లుతెలియజేసి వారిని చూడడానికి వచ్చానన్నాడు. ఇంతపెద్దకారులో, ఇంతగొప్ప మనిషి ఈ అనాథబిడ్డల్ని చూడడానికి వచ్చిందెవరైయుండునా అని వాళ్లందరూ చాలా ఆశ్చర్యం పొందారు.

ఆఫీసు రూములోకే పిల్లల్ని పిలిపించాశ. అమ్మాయి ఇప్పుడు ఘుమారు 14 ఏండ్లది. అబ్బాయికి ఘుమారు 12 సంవత్సరాలుంటాయి. వారిని చూడ్డంతోటే గుండెలు దడ దడ కొట్టుకో సాగాయి నరేంద్రకు. బిడ్డల్ని దగ్గరకు తీసుకుని ఏదో అనబోయాడు. కాని వాళ్లు ఇప్పుడు కొంచెం పెద్దవాళ్ళవడం వల్ల సిగ్గుపడ్డారు. తమ తండ్రేనని తెలుసుకోలేకపోయారు. తాను వాళ్ళకోసం తెచ్చిన బిస్కటు డబ్బాలు, పండ్లు మొదలైనవిచ్చి, తాను

వాళ్ళ తండ్రికి మిత్రుడననీ వాళ్ళతండ్రి 6 ఏండ్ల క్రిందట చనిపోయినాడనీ, అప్పటినుంచీ బిడ్డల జాడ తెలియక తాను వెతుకుతున్నాననీ, ఇప్పటికి వీరు ఇక్కడ ఉన్నట్లు తెలియగా చూచుటకు వచ్చినాననీ, ఇకనుంచి వీరిని చూడడానికి అప్పుడప్పుడు వస్తూ ఉంటాననీ, సినిమాలు చూపిస్తాననీ, కారులో ఎక్కించి త్రిప్పి తీస్కువస్తాననీ ఎన్నెన్నో చెప్పాడు. మేట్రన్‌ని పిల్చి ఈపిల్లలిద్దర్నీ కొంచెం ఇకనుంచీ "స్పెషల్ కేర్" తో చూడవలసిందనీ, వీళ్ళిద్దర్కీ వెనుకటివలె కుట్టుపనులు మొదలైనవి గాక స్కూలుపద్ధతిగా చదువు చెప్పించమనీ, వాటికి కావలసినధనము ప్రతి నెల తానుపంపిస్తాననీచెప్పి, అప్పుడప్పుడు ఈబిడ్డలిద్దరూ తనతో బయటకు వెళ్ళడానికి కూడా పర్మిషన్ అడిగాడు. మళ్ళీ 2 రోజుల్లోవచ్చి పిల్లల్ని సినీమాకు తీసుకువెళ్తానని చెప్పి ఇంటికి వెళ్ళిపోయాడు. నరేంద్ర వెళ్లిపోగానే ఆపిల్లలు అక్కడ పరిచారికగా ఉన్న కుంటి సుమతి దగ్గరకు పరిగెత్తుకొనివచ్చి ఎంతో ఆవేశంతో జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు తెలియపర్చారు. సుమతి, అంతవరకూ అక్కడి మేజాలు కుర్చీలు తుడుస్తున్న మనిషి, చటక్కున ఆపేసి ఆఁ! ఏమిటీ, ఎవరు వచ్చింది? ఆయన పేరేమిటి? ఎట్లా ఉంటారు? మొదలైన ఒక వంద ప్రశ్నలేసి, "ఆయనమళ్ళీ వచ్చినప్పుడు నన్నూ పిలవండమ్మా తలుపు చాటునుంచైనా చూస్తాను" అంది.

ఆరోజునుంచి ఈపిల్లలకి మంచి భోజనం ప్రయివేటు అంతాను. రెండు రోజుల తర్వాత తన వాగ్దానం ప్రకారం, పిల్లల్ని సినీమాకు తీస్కువెళ్టానికి ఒచ్చాడు నరేంద్ర. పిల్లలకోసం మంచి మంచి బట్టలు కూడా కుట్టించి తీసుకొచ్చాడు. క్రొత్త బట్టలువేసుకు తన కారులో రమ్మన్నాడు. ఈపిల్లలు ఎప్పుడో చాలా రోజులక్రిందట తమను ఆశ్రమంలో పెట్టిన సుందరమ్మగారి కారు 1, 2, పర్యాయములు ఎక్కడమేతప్ప, మరెప్పుడూ కారు ఎక్క ఎరుగరు! నేడు వారి సంతోషానికి మేరలేదు. పిల్లల్ని సినీమాకి (తన స్వంత "థియేటరు" లో) తీసుకు వెళ్ళి లోపల Dress circle అనగా పెద్దసీట్లలోనే కూర్చోపెట్టి, తాను మధ్య మధ్య వస్తూ ఉంటాననీ భయపడవద్దనీ చెప్పి బయటకు వెళ్లాడు. అసలు సంగతేమిటంటే, అక్కడ తనక్రింద పనిచేసే వాళ్ళందరూ చూచి ఏమనుకుంటారోనని భయం!! "ఇంటర్‌వల్" లో వాళ్ళ కోసం "అయిస్‌క్రీము" కూడా పంపించాడు. సినిమా అఖరయి పోయింది. పిల్లలు ఇంత ఆనందమిదివర కెన్నడూ పొందలేదన్నారు. పిల్లల్ని ఆశ్రమంలో దింపటానికి వచ్చాడు. షుమారు సాయంకాలం 6½ గంటలైంది. కారు ఆశ్రమం ముందర ఆగింది. అప్పటికే గబగబ తనపనులన్నీ ముగించుకుని ఆవచ్చే ఆయన ఎవరో చూద్దామన్న ఆశతో, పిల్లలకోసం వేచియున్న దానివలె వీధివరాండాలోనే నుంచుని పిల్లల్కి స్వాగతం ఇచ్చింది, సుమతి. ఆయన కారులోంచి దిగకుండానే పిల్లల్ని జాగ్రత్తగా లోపలికి తీసుకువెళ్లు; నాకు ఆలస్యమయింది నేనుదిగను అని చెప్పి వెళ్ళిపోయాడు. సుమతి తాను ధరించిన "గాగుల్స్" (రంగుల కళ్ళజోడు) లో నుంచే ఆయన్ను చూచింది. ఆయన పల్కిన పల్కులు, గొంతుధ్వనిని గుర్తుపట్టింది. అనుమానం తీరిపోయింది. అతను తనభర్త నరేంద్రయే! తాను రైలు ప్రమాదం నించీ బ్రతికివచ్చినప్పటినుంచీ ఒక్కసారియైనా కళ్ళ అద్దాలు మాత్రం ఎప్పుడూ తీయలేదు సుమతి. కుంటికాలు, మెల్లకన్ను, కనుబొమ్మమీద ఒక పెద్దమచ్చ కూడా సంప్రాప్తించబట్టి తన భర్త కూడా ఎప్పటికీ తన్ను గుర్తుపట్టడం అసంభవమని తెలుసుకుంది. ఈవిధంగానే తనరోజులు గడపవలసివస్తుందని కొంత విచారపడ్డది. ఎవరికర్మ ఎవరు తప్పించగలరు? పిల్లల ఎడనైనా ఆయన కనికరం చూపిస్తున్నాడుగదా భగవంతుడా, అనుకొని సంతోషించింది. కాని పిల్లలతో తాను తండ్రినేనని చెప్పి ఏల తీసుకొనిపోడా అని ఆశ్చర్యం పొందింది. ఈవిధంగా అప్పుడప్పుడు నరేంద్రవస్తూ ఉండడం, పిల్లలనుబయటకు తీసుకువెళ్లి త్రిప్పితీసుకురావడం కొన్నాళ్లు సాగాయి. ఒకనాడు సుమతి ధైర్యం తెచ్చుకొని నరేంద్ర వచ్చినప్పుడు అతనితో "నేను అనాథస్త్రీని, నాకు ఇక్కడ పనులు చాలా భారంగా ఉన్నాయి. అసలే కుంటిదాన్ని ఇన్నిపనులు ఇక్కడ చేయలేకపోతున్నాను,

మీ ఇంట్లో ఏపనైనా ఇచ్చి నన్ను సంతోష పరచండి అని వేడుకుంది. నాకు భోజనం పెట్టి కట్టుగుడ్డ ఇస్తే చాలును. నేనేమీ ఇంకకోరను. ఏపనైనా చేయగలను" అంది. అదివరకే, చెప్పి ఉంచబడ్డ పిల్లలు కూడా అందుకని ఈపనిమనిషి చాలా మంచిది. "మమ్మల్ని కూడా ఎంతో ప్రేమతో చూసుకుంటోంది" అని 'సిఫారస్' చేశారు. "సరే ఖాళీ ఉంటే చెప్తాన్లే" అని వెళ్ళిపోయాడు నరేంద్ర.

అక్కడ సరోజకు ఇదివరకప్పుడే పదిమంది ఆయాలు మారడం అయింది. ఒకరూ నచ్చడం లేదు.

నరేంద్ర ఒక రోజు సరోజతో "నీకోసం ఒక మంచి ఆయా నొకదాన్ని కుదిర్చాను కావాలా?" అన్నాడు. సరోజ సంతోషంతో "కావాలి తప్పక త్వరలో నే పిలిపించండి" అంది. నరేంద్ర ఆశ్రమానికి వెళ్ళి అక్కడి అధికారులను కలుసుకొని, తన భార్యకొరకొక మంచి నమ్మకమైన ఆడమనిషి చాలా అవసరమనీ దయచేసి ఇప్పించమనీ కోరాడు. అదివరకే ఏ ఇంట్లోనైనా పని ఇప్పించండి; ఇక్కడ ఇంత పని చేయలేకుండా ఉన్నానంటూన్న సుమతిని పిల్చి, వీరింట్లో పని ఖాళీ ఉందట చేస్తావా అని అడిగింది అక్కడి మేట్రన్ సుమతిని. "తప్పకుండా ఆ పని తీసుకుంటానంది సుమతి. సుమతికి పిల్లల్ని విడిచి వెళ్ళడం ఇష్టంలేకపోయినా, భర్తవద్ద సేవచేసి, అతని గుట్టు అంతా తెలుసుకోవాలన్న వాంఛవల్ల, పిల్లలతో అప్పుడప్పుడువచ్చి చూస్తూ ఉంటానని చెప్పి ఆశ్రమవాసులకు ధన్యవాదాలు తెల్పి నరేంద్రభార్య సరోజకు ఆయాగావెళ్ళిపోయింది సుమతి. మంచి నేర్పరి కాబట్టి (కురూపి యైనా) త్వరలోనే ఆవిడ అనుగ్రహం సంపాదించింది. ఇక్కడ సుమతికి ఎక్కువ పనిలేదు. అమ్మగారి బట్టలు మడతపెట్టడం, పిలవంగానే వస్తున్నానమ్మా అని వెంటనే పలకడం మాత్రమే. ముఖ్యంగా అమ్మగారు ఇంట్లో వుండడమే తక్కువాయి మరి!

నరేంద్రకు ఇతర నౌకర్లు ఎంతమంది ఉన్నప్పటికీ, సుమతి వచ్చినప్పటినుంచీ, ఆయన ఆఫీసునుంచీ రావడం తోటే తానే స్వయంగా సుమతి ఆయనకు "టీ" చేసి తీసుకువెళ్ళి ఇవ్వడం, స్నానానికి వేడినీళ్లు పెట్టించడం, ఆయన స్నానానికి వెళ్లే టప్పటికి బట్టలన్నీ పెట్టి తయ్యారుగా ఉంచడం, మొదలైన చిన్నచిన్న పనులన్నీ చేస్తూ వుండేది. ఇవికొన్ని క్రొత్తమార్పులే. ఈమె పరిచారిక అవడం చేతనూ, తనకు ఇంకా ఇతర నౌకర్లు ఉండడం వల్లనూ సుమతితో ఎప్పుడూ మాట్లాడవలసిన అవసరం కలగలేదు. కాని తనకు ఈ క్రొత్త పరిచారిక చేస్తూన్న చిన్నిచిన్ని సౌకర్యాలు కనిపెట్టకపోలేదు నరేంద్ర. ఒకనాడు "టీ" బల్లమీద ఉంచి ఒక ప్రక్కగా నుంచుని "పంతులుగారు ఆశ్రమంలో బిడ్డల్ని చూచి వచ్చినారా?" అంది సుమతి. ఇది 2 వ పర్యాయం సుమతి గొంతువినడం. నరేంద్రకు ఎవరో తనకు బాగా తెలిసినవారి గొంతు విన్నట్లయింది!!

ఈ దిక్కులేని పరిచారికకు ఆ బిడ్డలమీద ఏల అంత మక్కువ? ఇదివరకెందరో పరిచారికలు పనిచేసి వెళ్లినారే, ఈమెవలె ఇంత మనస్ఫూర్తిగా పనిచేసిన వారిదివరకెవ్వరూ లేరే! నరేంద్రకు ఇదంతా ఏమిటో అగమ్యగోచరంగా వుంది. సరోజ బయటకు వెళ్ళియున్నందున, సావధానంగా ఈ పరిచారిక ఎవరో అడిగి తెల్సుకొందా మనుకొన్నాడు. "అసలు నీవెవరవు? ఈ బిడ్డలన్న నీకు ఇంత అభిమాన ముండుటకు కారణమేమి?" అన్నాడు.

తనకునూ ఇదేవయస్సు వాళ్లిద్దరు బిడ్డలుండే వారనీ, అందువల్ల వీరంటే చాలా ప్రేమభావం గలదనీ, తానొక అనాధస్త్రీననీ, మాత్రంచెప్పి పొర్లి పొర్లి వచ్చేదుఃఖాన్ని ఆపుకోలేక లోపలికి వెళ్లిపోయింది.

ఇంకా అడిగితెలుసుకోవాలంటే అవకాశం చిక్కలేదు నరేంద్రకు; కొన్నిమాసాలు గడిచాయి.

(సశేషము)

# ఉమా తపస్సు



### కపటవటువు

తోడు యెవ్వరునీకిట తోయజాక్షి! ఎవరి కొఱకని తపమిట్లు నీవుసేయ
వలయు? భోగ్యమ్ములెన్నైన బడయఁగలవు నీదుజనకునియింటనే నెమ్మితోడ.

స్వర్గంబికేల నిర్జరులు మీయింటనే నివసింతురెల్లప్డు గలరె! వలదు;
భాగ్యంబులేల భాస్వద్రత్ననిధియని పేర్గాంచె నీతండ్రిబేల! నిజము;
మోక్షమ్ముకోరియే ముక్కుమూసితివన్న అబలకు తపమునర్హమ్ము సుమ్ము;
అధికమ్ముకోరి నీవాచరింతువె తపంబిట్టి దీక్షకు బూనుటెగ్గు గాదె.

అంబ! వలదనినీతల్లి యనినకూడ తపముసేయఁగ నీరీతి దడయకుండ
వనికివచ్చితివా? ముది బ్రహ్మకైన బుద్ధియున్నచో యీబుద్ధి పొడమకుండు.

తిరిపెమెత్తును; లోకాలు తిరుగునన్ని; జడలుమేనెల్లకప్పు; నాకడుదరిద్రు
నిల్లువాకిలిలేనట్టి "యీశు"గోరి పొందఁబోయెడి సుఖమేమి "యిందువదన".

తిరిపెగాడికకోర్కులు తీర్పగలడె? ధనికుడైనచో వాంఛలు దనుపగలడు
ఐనధర్మసూక్ష్మంబు నీవరయనగును; తిరిపెగాడను పైపెచ్చు దిక్కులేడు.

సుందరరూపమున్ తరుణి! చూచుచు చూచుచు వమ్ముసేయుటొ
నందురు; ముక్తికాముకులు నాడుదు రంతియ; కాని నీవు కా
దందువయేని నీకొఱకు యగ్నిని తాముగ దూక నుద్యమిం
త్రెందుకు కోరుదమ్మ వరమిచ్చెద; "ఈశుడు" వచ్చి వద్దనన్.

బూడిదపూతయున్ తనువు; పూనెను పుత్రెను చేతిలోన; యో
చేడియ! వానికోరతగ సెప్పినదెవ్వరు? నీకెపుట్టెనా!
పాడియె భాగ్యహీనుని యపారతప్రేమకు నాటపట్టు; పెం
డ్లాడగ చెల్లు నేవసుధ నందరునవ్వరె దూసిపోయరే?

"వైదేహి"

(సశేషము)

# త్యాగమూర్తి



శ్రీమతి ఆర్. యస్. అన్నపూర్ణాదేవిగారు

(1951 ఫిబ్రవరి సంచిక తరువాయి)

'గీత' రఘు యింటికెదురుగానున్న, శ్రీమంతుడు 'మూర్తి' ఏకైకపుత్రి. సౌందర్యరాశియని చెప్పుటనవసరము. చిన్నతనమునుండి, తనకాపె పరిచయమే. రఘుకు, పసికందు 'గీత' యన్న అమితప్రేమ. తన పిల్లలతో ఆటలాడ వచ్చెడిది. అట్టిచో శశి గీతలు కలసి మెలసి ఆడుకొనువారు. శశికి, గీత బాల్యస్నేహితురాలు. ఆట పాటలతో ఆరంభమైనది వారినెయ్యము. నేడు శశి యువకదశనున్నచో, గీత, నవయౌవనయైనది. శశికి, పదునెనిమిది వత్సరములు. గీతకు పదునైదు వత్సరములు. వారిలో పూర్వ పరిచయము మరుగుకాలేదు. కలయికలు చాల కొద్ది యనవచ్చును. బాల్యస్నేహితులే. నేడు వారి దృక్పథములు, భావనలు వేరు. చిన్నతనపు చెలిమి కాల బలిమిని ప్రేమగా మారినది. వారి యనురాగమున, మూర్తిహృదయమున - వారు దంపతులేల కాగూడదనిపించినది. గీతకు శశి తగినవాడే. స్థితిలో తాను శ్రీమంతుడైననేమి? శశి తనకు అల్లుడగుట సమ్మతమే. కాన గీత శశితో సంచరించుట కాతని అసమ్మతి లేదు. కాలక్రమమున వారి ప్రేమకు ఫలితము - వారు - అనురాగదంపతులగుటయే. రఘుకు గీతయన్న ఎంతయో ప్రీతి. వారి యనురాగమునంతగా నాతడు గమనింపలేదు. అతని లక్ష్యము శశి గొప్పచదువు చదివి - ఘనుడనిపించుకొనుటయే! ఆ లక్ష్యమునకు తన ప్రాణమైన బలినీయగలడు! శశి చదువు కొంత మందగించినది. అతనిపోకడ వర్తన చూచాయగా గ్రహించినాడు రఘు. గీతపైగల ప్రేమ తెలిసినది. గీత, తన మఱదలగుట తన కంగీకారమే; కానీ, యిప్పటిలో అది పొసగనిదే - కారణము; శశి చదువున కంత రాయముకదా? గీత, శశి ప్రణయము చాలదూరముపోయినది. ఇక వారిని విడదీయుటము కష్టమే; కాని - పై చదువునకు, శశిని కలకత్తా పంపతలచినాడు. అది చాలశ్రమయుతమే. పట్టణవాసము - కళాశాలలో పై చదువు. అంతధనము తనెలా తేగలడు? ఏమైననుసరే, శశి, కలకత్తా వెళ్లవలసినదే! తను సంపాదనకు తోడు - మరికొంత శ్రమపడిన - తీరునుకదా? శశి, ఇంటరు పరీక్షయందు దాటితేరినాడు. గీత, యానందమునకు మేరలేదు. రఘు, 'శశి'ని, డాక్టరు పరీక్షకు పంపతలచినానని - కలకత్తా వెళ్లవలయునని తెల్పినాడు. ఇది విషమసమస్యగా పరిణమించినది. గీతనువిడచి, తనెలా బ్రతకగలడు? గొప్పచదువు - పట్టణవాసము - చాల కోరతగినవే! ఏమిటో, సంతోషము సగముబలమనిపించినది - తన ప్రయాణము తప్పనిదే - గీతయశ్రువులు చూడలేకపోయినాడు. తన్నుతక్క అన్యుల పరిణయమాడనని యామెకు బాసచేసినాడు. తను లేఖలతో నిరంతరము క్షేమసమాచారముల తెల్పుదుననినాడు. విడలేక విడలేక, ఆప్రేయసీ ప్రియులు విడువడినారు. 'కాలగతి మాన్పంగ తరమె ఎవ్వారికైన!'

♦ ♦ ♦

కలకత్తాలో ప్రవేశించిన శశికి క్రొత్తలో చాల కష్టముగనుండినది. పట్టణములోని విద్యార్థుల వేష, భాషలు - వింతగా కన్పట్టినవి. తనయూరికి - యిచ్చటికి - హస్తిమశకాంతరమే! ధనమునకు విలువయున్న కదా! ఎంతైనను చాలడములేదు. తనయన్న కనవసరశ్రమ కల్గించకూడదనుకొన్నను ధనవ్యయము చాల ఎక్కుడుగనున్నది. ఇంత ధనము తనకు సకాలములో రఘు పంపగల్గిన శశికి ఆశ్చర్యమనిపించినది. సెలవులకు యింటికి వచ్చినప్పుడాతనికి, రఘు పైకము పంపువిధము కొంత తెలిసినది. రఘుకు - తనకువచ్చు వేతనము సంసారఖర్చులకే తగును. తనకైయన్న - తన యుద్యోగ నిర్వహణానంతరము - మిల్లు లెక్కలు

సరిచూచి, ప్రయివేటులు చెప్పి, గడించుచున్నాడు. రఘుకు, తీరికసున్న. శశిచదువు, రఘు చెమటకంటె- రక్తముతో- గడచుచున్న దనవచ్చును. కాని రఘు. తన శ్రమను తనకు తెలుపలేదు. పట్టణమున కష్టపడక, తనకు కావలసిన మొత్తము వ్రాసిన పంపగలనన్నాడు. ప్రపంచమున తనకుమాలిన ధర్మ మున్నదా? అట్టిచో ఏమిటి. యీసోదరుని వాత్సల్యము? శశికి, రఘు, సోదరుడనుటకంటే తండ్రియన్న సమంజసమేమో. అట్టి సహోదరుని కల్గిన శశిధన్యుడనుటలో సందేహమా? రఘు తనకైపడుచున్న శ్రమజూచి శశి జాలినందినాడు. ఇంతకష్టమునకు, ప్రతిఫలము? తను, డాక్టరుగా, రాగనే తీర్చగల్గుదునని తలచినాడు. తన అన్నకు తనచర్మముతో చెప్పులు కుట్టియిచ్చినను ఋణముతీరదు. తను- శ్రమలకోర్చి అన్నకోర్కె తీర్చుట తనవిధి గీత. తన వియోగబాధతో చాలా కృషించుచున్నది. తనచదువు ముగిసిన అన్నకు విశ్రాంతి, తనప్రణయ రసాధిదేవికి హృదయశాంతి చేకూర్చకలదు. ఆమధుర భావనలే ప్రియుల విడివడి యుండుట కుపకరించినవి. కానిచో- గీత శశినివదలి యుండలేదేమో !

శశి ప్రప్రథమ శ్రేణిలో కృతార్థుడగుచు- నాలుగేండ్లు గడపినాడు. ఇక ఒక్కవత్సరమే. తన వ్రతముగడచిన, తన యిడుములుగడచినట్లే! రఘుకు దేహారోగ్యము నశించినది. తలకుమించినశ్రమ. కానీ, యిక యొక్క సంవత్సరమేకదా! తర్వాత, తనశశి. తనయాశయ పరిపూర్తిగావింపగలడు. తనశ్రమ సన్నగిల్లకలదు. నాడు పర్వదినము కానీ వింతగా శశి కొద్దిరోజులనుండి ధనము, నెక్కువగా పంపకోరినాడు. పట్టణమున ఏకష్టములు కల్గునోయని, చేత లేనందున, రఘు - భార్య నగలనమ్మి పంపినాడు. విచిత్రముగా, శశి- మాటిమాటికి డబ్బుపంపమని, వ్రాయసాగినాడు. శశితో ఏమిటీ యీమార్పు! బహుశా కావలయునేమో? అన్యాయముగా వ్యయమొనరించెడి వాడు కాడే? తనజీవితము నెంతో సక్రమపథమున నడుపుట తనకు తెలిసినదే! కానీ- ఏమిటో కొంత చింతకల్గినది. అనుమాన మినుమడించినది గీత, రాకతో. గీతకు శశికి ప్రణయభావనలున్నవని తనకు తెలిసినవే. కానీ ప్రేమికులేలా బహిరంగముగా తెల్పగలరు. గీత పరిణయమై రఘుతో మూర్తి ప్రస్తావించియుండగా చదువు పూర్తియైనంతటనే. చేయకలవాడనని వాగ్దాన మొసగినాడు. గీత, తనకు, కాబోవు 'బావ' గారితో, అంతగా మాట్లాడుటలేదు. చిన్న తనమప్పుడు రఘు. తన్ను, లాలించినది నిజమే. కానీ నేడు - ఆతను తనకు కాబోవు భర్తకుఅన్నగారు; కాన కొంతసిగ్గుగా యుండెడిది. చనువుగా ప్రవర్తించుటకు నాడు గీతరాక ఆశ్చర్యము గల్గించినది. రఘు గీతనుచూచి

“గీతా, ఏమిటి సంగతి చాలరోజులకు రాకకదా” యన్నాడు పరామర్శకంగా.

గీతలోని ముఖకవళికలలో, విషాదచ్ఛాయలు స్పష్టంగా గోచరించినవి. ఎందుకా విచారము? రఘుకు కారణము గోచరింపలేదు. గీతలోని యీమార్పు, తన్ను కలవరపరచినది. అప్రయత్నంగా, గీతకంట నీరొలకడమును గుర్తించి

“గీతా ఏమిటి సంగతి కంట నీరెందుకమ్మా? సంగతి చెప్పవూ? ఎందుకా విచారము” అన్నాడు. అశ్రువులు పొంగి పొరలినవి. మాటలు తడబడినవి గాద్గదికంతో.

తమ్ముడుగారు - జాబులు వ్రాస్తున్నారా? ఆరోగ్యమేకదా? యన్నది. రఘుకు కొంత గీత యవస్థ గోచరించినది. శశినుండి జాబురాలేదని బెంగ ఏమో? మెల్లిగా,

‘ఏం, శశి జాబువ్రాయలేదా? కొంతజాగైనదేమో - వ్రాస్తాడు లేవమ్మా - అంతమాత్రమునకేనా యీచింత’ యని సముదాయింప చూచినాడు.

‘బావా, కొంతజాగా? రెండునెలలైనది శశినుండి జాబువచ్చి; ఎన్నిమారులు వ్రాసినా బదులులేదు. ఇక నిలువలేక, క్షేమమరయ వచ్చినా’నన్నది యికమాటలు పెగులలేదు. రఘుకు మతిపోయినట్లైనది.

శశిలో యింతమార్పా? ఎందుకీ విచిత్రవర్తన. కారణమేమో? శశి ఖర్చులు మితిమీరిపోయినవి. చాలా చిత్రమే. గీత, పాపము-దిగులుగొన్నది. ఎందుకో కాలహరణమైనది. బహుశా తీరికలేదేమో కడపటి వత్సరముకదా? ఇన్నిరోజులలో లేని చదువా? ఏమిటో వింతభావములు రాసాగినవి. శశి ప్రవర్తనలో లోటులేదు. ఏమి కారణమో? గీత నోదార్చుతూ

"గీతా, బహుశా, చదువుతొందరలో ఏమరినాడేమో? నేను వ్రాసి తెలుసుకొంటానులే. తొందరపడకు, అంతమాత్రమునకు చింత ఎందుకమ్మా' అన్నాడు. గీత, బావగారి వాక్కులతో కొంత యుపశమించినట్లు కన్పించినది. గీత, రఘుదగ్గర శలవు తీసుకొని వెళ్లినది. రఘు ఆలోచనలో పడినాడు. శశి వ్యయములోని మార్పు, ప్రాణప్రదముగా చూచు గీతకే జాబువ్రాయకపోవడము ఏమిటి యీవిచిత్రపు ప్రవర్తన? ఆలోచనల కంతరాయము కల్గినది. తంతి వచ్చినది. 'శశి' నుండి తనకు ఆరువందలు అవుసరముగా పంపవలెనని. కొద్దిరోజులకు మునుపే అప్పుచేసి మూడువందలు పంపినాడు. మరి యిదిఏమి? తన అనుమాన మినుమడించినది. శశిలో మార్పు స్పష్టముగా కన్పించినది. తన కనవరసర శ్రమయొసగని శశి! ఏమిటి యీదారుణ పరిస్థితి. అంతధనము తనెలా తేగలడు? తను కలకత్తా వెళ్లి స్వయముగా, శశినిచూచి, ధనము నీయ సంకల్పించినాడు. సాయంత్రము తనపేర లేఖవచ్చినది.

రఘుగారికి, శశిహితుడు, మధు, నమస్కృతులు; తమకు నేను అపరిచితుడనే! శశి నాకత్యంత హితుడు. ఆతని విచిత్రప్రవర్తనయే నాలేఖకు కారణము. శశిజీవితములో గొప్పతుఫాను ప్రారంభించినది. దుష్టసహవాస మబ్బినది. ఎట్లు కలసినదో. శశికిని, దేవదాసి, శోభకు హితము కలిసినది. ఇక వేశ్యవిహితము, దానిఫలితము చెప్పవలెనా? చదువునకు స్వస్తి. పెడదారి త్రొక్కినందుకు చాల విచారము కల్గినది. హిత మాతనికిప్పుడు రుచించుటములేదు. త్వరలో మీరు రాకున్న శశిగతి ఏమగునో! ఎట్టివానికెట్టిమార్పు. అగ్నికే చెదలంటినది. ఈ విషయము మిమ్ము యావేదన పెట్టినను, యిప్పటిలో మార్గాంతరము కన్పించలేదు. సమక్షమున సంగతులు తెలియగలవు. ఇప్పటిలో మీరాక యత్యంతావసరము. మీకు మానసికావేదన సమకూర్చినచో మన్నింపవేడుతూ విరమించు,

'మధు'

రఘుకు తలతిరిగి పోయినది. కలలో తలచని సంఘటన శశికి. దేవదాసి పొత్తా? నిజమా? తన శశి! అట్టినైచ్యమునకు పాల్పడునా? ఇది అపవాదనుకొందమన్న ఆ వ్యక్తికి కల్గెడి లాభమేమి? శశీ, ఎట్టిదారుణము! తన యాశలిట్లు పరిణమించినవేమి? వెన్నపడుచో భాండము బ్రద్దలైనదా? విధి! అమృతమయ కళశమున హాలా హలము! కలలోనైన తలవని విపత్తు. చేసెడిదేమి? అందుకేనేమో, తనకావ్యయము. గీత వేదనలోని యర్థమిదే. కానున్న తనప్రాణప్రదమైన గీతకే జాబువ్రాయక పోవటము. ఇంతకూ, తన యాశలు, శ్రమ, ప్రతిన, యుత్సాహము నట్టేట కలసినది. విధి అనుల్లంఘనీయము! చేసెడిదేమి – అనుభవించక. తనకు కలకత్తా ప్రయాణము తప్పని సరియైనది. తన శశికై, తన సర్వసౌఖ్యముల బలినిచ్చినది, శశినొక విలాసిని కామపరితప్త పరిష్వంగమునకు దాసుడౌనట్చుటకా? శశి, గీతను పరిణయమాడి సుఖించుట చూడతలచిన తనకు శశి విలాసవతి వయ్యారముల వలలో చూడవలసి వచ్చెనే చేసెడిదేమి? ముండ్లునాటి పండ్లనాసించిన తగునా?

♦ ♦ ♦

అదిశోభగది. అత్యంత మనోహరముగా నలంకరింపబడినది. శోభ నవయౌవ్వని. రూపవయోవిలాసముల కునికి దేవదాసి. శశిని చూచిననాటినుండి యాతనిపొందు నభిలషించినది. తనకులవృత్తిలో దిగి రెండు వత్సరములే యైనను, సిరిగల పేరు గనుక, ఎంతోగడించినది. సానిటక్కులకు కొదువలేదు.

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్ల పగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



బిడ్డల ఆరోగ్యమునకు

ప్రసిద్ధిచెందినది:

# రమణీస్
# బేబి గ్రైప్






తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కొ., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్,
బరంపురము (గంజాం), బొంబాయి.

విద్యాగంధముకూడ, వయోవిలాసాదులకుతోడు, శశి, తన్నుకన్నెత్తి చూచినదిలేదు. అతను విద్యార్థిలోక మునకు వ్యతిరేకి. ఎందుకో యాతని రూపురేఖలు తన్నాకర్షించినవి. తనవయ్యారములు, కులుకులా పెను తోడ్పడలేదు. పన్నినదొకమిష. కళాశాలకు వెళ్లునపుడు, పెద్దకేకపెట్టినది. శశి దిగ్భ్రాంతుడై చూచి నాడు. నిర్ణయ ప్రకారమామె సేవకులతనికడ పరుగిడి వారి యజమానురాలికి ప్రమాదమని-సహాయమవసర మనిఅన్నారు. పాపము, కష్టమునమన్న ఆడదని పరుగిడినాడు. శోభ అచట పడియుండినది. ఏదోకరచినదట. తనకామె యవస్థ యగోచర మనిపించినది. తనకు తెలిసిన ప్రథమచికిత్సచేసినాడు. గుణ చిహ్నములేవి కన్పించలేదు. ఆమె అలాయగుటకు కారణమేమో! నటన యన్నసంగతి పాప మాఅమాయకునకు గోచ రించలేదు. తర్వాత ఆమె తేరుకొన్నది. సేవకులు డాక్టరును తోడ్కొను మిషతో వెళ్లినారు. శోభకది చక్కటి సమయము. మెల్లిగా "క్షమించండి, పాపము. మీకు అనవసరముగ శ్రమ కలుగజేసినందుకు, చాలా చింతగానున్నది." "ఆఁ! శ్రమయేమున్నదిలేండి, కష్టములు మానవులకుగాక మానులకా," యన్నాడు.

'ప్రపంచములో, తమవంటి దయస్వరూపు లేకోటికొక్కరో. ఇంతకూ' యీకష్టమే, తమ పరిచయ భాగ్యము సమకూర్చినది. మీఋణమేలా తీర్చగలనో? ఇంతకూ తమపేరేమిటో తెలుసుకొన వచ్చునా? అన్నది.

'శశి' యన్నాడు మెల్లిగా.

'అపూర్వ కలయికే! శశి యాదరమున్నదేగా శోభ జగతికి' యన్నది, తాను శోభయన్నది తెలియ జేసినది. అపూర్వమైన కలయిక. ఇక తన్ను శయనాగారములోనికి తీసికెళ్లమన్నది. శశికి కొంతసిగ్గనిపించినది. వెళ్ళకున్న కటికనేల యాసుకుమారికి శయ్యయా? శోభకోరిక లీడేరు కాలము సన్నమగుటచే నాటి రాత్రి శశి హృదయమును, కలచి, వలపించి, వలపు దోబూచులతేలి, ధన్యుగాలి ననిపించుకొన్నది. శోభ వెలయాలు, వెలలేనిది, చెంతచేరునా. శశి దాసుడై, తన కార్యమును మరచి, శోభకు పాదాక్రాంతుడైనాడు. శోభ కనుసన్నలతో కోర్కె లీడేరవలసినదే. శోభనుండి తప్పించకోలేకపోయినాడు. గీత నుదుటి గీతప్రకా రము ఏమగునో - కానీ. తనకామె స్మరణయేలేదు. అన్న, యాతని యావేదన, ఆశయములు తనకు తెలిసినవే. అన్నియు శోభముందు, ఫేలవయు ననిపించినవి! శోభకోరికలు తీరుట కన్నను లేఖలవర్షము ధనము, ధన మూలం మిధం జగత్ కదూ! శశీ. ఎక్కడి శశి. శోభ కృత్రిమప్రేమ డోలికల, వాస్తవజగత్తాతనికి కన్పిం చలేదు. అట్టిదా శోభప్రతిభ. అందుకనే "ఆడువారి చూపుటంపర గెలువంగ తరము కాదు." త్రిపురవైరికైన యన్న నీతివాక్య. శశి కాలప్రభావమున కర్తవ్యతా మూఢుడై- శోభవలపు బానిసయై చరించుచున్నాడు.

శశికి హితుల బోధలు తలకెక్కలేదు. సహజమే, రోగికి పథ్యము రుచించునా. శోభ వెలయాలా? అనురాగ రసలహరి. లోకము ప్రేమతెలియక తన శోభను, కులట యంటున్నది. నిజమునకామె సద్గుణఖని తనకు తెలియును; తన శశిని విడిచి క్షణముండలేనిది ప్రత్యక్షముగ తెలిసినదే. లోకము గ్రుడ్డిది. తనకు లోకులతో పనిలేదు. కాని, కాలమెుక్క రీతిగా గడవదన్న నిజము, శశికి తెలియు రోజులు వచ్చినవి. శోభవర్తనలో మార్పు కన్పించినది. ప్రవర్తన మారినది. తన్ను అలక్ష్యము చేయు రోజులు వచ్చినవనిపించినది. శోభయింట నూతన యాగంతుకులు కన్పించ సాగినారు. తన యాజ్ఞలశిరసా వహించు శోభ - నేడంత శ్రద్ధ చూపునట్లగుపించలేదు. వెల యాలిగుణము వెలుగునకు వచ్చుచున్నది. కాని శశి భావనలో మార్పులేదు. నేడాతని యాత్మగౌరవము కూడ మంటగలసినది. శోభ ప్రేమ తనకున్న చాలు - ఆమెవర్తన ఎలాయున్న తనకెందుకు? శోభకు యిక శశినుండి యాశించవలసినదిలేదు. ఇక గెంటడమే తరువాయి. శశిచాల చిక్కిపోయినాడు. కన్నులు గుంటలు పడినవి. శోభకడకు రాగా చాల తిరస్కారముగ పల్కరించినది. శశిని చూచి 'ఏమీ - శశిగారికింకను మోజు తగ్గలేదా? ధనములేని శశి. పలుకుల తీపితో పొట్టగడచునా'? యన్నది ఎత్తిపొడుస్తూ.

(సశేషము)






(ఫిబ్రవరి సంచిక తరువాయి)

## 3_వ అంకము.

### 1_వ రంగము

రామరాజు:- శంకరా, నీవు బోయినపని యేమాయె వివరింపుము.

శం:- నీవిచ్చిన జాబుంగొనిపోయి యనంగ సేన కెట్లిత్తునాయని అటునిటు నడయాడు చుంటిని. మందుకొఱకై పురములోనికి బోనిమ్మని మాలతి ద్వారపాలకులను వేడుకొనుచున్నది. వారటకాయించుచు న్నారు. సేనదిజూచి మందులవాని వేసం బునబోయి యావుత్తర మామెకిచ్చితిని.

రా:- మంచిపనిజేసితివి. యిపుడామె వ్యాధి యెట్లున్నదో దెలియునా ?

శం:- బాగుగా నయమైనది; కాని నాకుజాబు లందించుటకే యింకను నయముగా నట్లు నటింపు చున్నామని మాలతివ్రాసి నది, ఇకత్వరగా వారినిటనుండి దప్పింపవలెను.

రా:- ముందుగా నొక ఘనకార్యము నెర వేర్చవలెను. అందుకు కావలసిన ముఖ్య కార్య మొకటిమాలతిద్వారా కావలెను. తరువాత వారినిదోడ్కొని పోవుదము.

శం:- ఆమెవల్ల నెరవేరవలసిన పనియేమి?

(ప్రవేశము. తిరుమలరాయలు)

రా:- ఖానుతో మంచిమాటలాడి యామెని యుంగర మొకటి సంపాదింప వలెను. దానిని నానవాలుగాజూపి విజయసింహుని ముందుగా విడుదల జేతుము.

తి:- అన్నా: విజయుని విడుపించ వలెనా? యెచ్చటనున్నాడు.

రా:- చిరకాలమైత్రితో మెలగుచున్న ఖాను రాజద్రోహులను ఆనంగసేనను చేర దీసెననియు, వారినిబట్టి తనకర్పింపనిచో యుద్ధమునకు వత్తునని రాయలువిజయు నిచేత రాయబారమంపె. ఆదిల్

సాహో యుద్ధమునకే సిద్ధమై విజయుని కారాగారమందుంచె.

తి:- ఏమీ యీ సమాచారము రాజుకు దెలియునా?

రా:- లేదు నీవీజాబునుగొని పోయి మంత్రి కిమ్ము; త్వరలో సైన్యము నాయత్తము చేయుచున్నాము.

తి:-త్వరలో సైన్యముతోనే వచ్చెదను; విజయునికి సంభవించిన యాపదగూడ తెలియజేతును. (పోవును)

రా:- శంకరా: నేనుఫకీరు వేసంబున బోయి కంబర సేనునకు బాగుగా నాటునట్లు రామయమంత్రినిగూర్చి చెప్పియున్నాను. మహమ్మదీయులకు రామయ్య మంత్రి సంఘటింప జేసినమైత్రిని క్షణములో భేదింపజేసితిని. యింక మనమల ఖానునొకనికి తగినశిక్షగావింపవలెను.ముందుగా విజయుని దప్పింపవలెను. నీవుమాలతి వద్దకేగి నేటిరాత్రికి యుంగరముతో సహా యామెను దోడ్కొనిరమ్ము.

శం:- రామయ మంత్రియెడ నీమహమ్మదీయుల కత్యంత గౌరవము గల్గియుండుట జేసితో ఫల్ ఖాన్ యింతవరకనంగ సేన కవమానము జేయలేదు. లేకున్న యేమయ్యేడిదో!

రా:-నేడు ఖానుతప్పక రాము మందిరమున కేగునట్లు జేతును. ఈసంగతులన్నీ మాలతికి జెప్పుము. నేటిరేయితప్పక విజయుని విడిపింపవలెను. లేనిచో ముక్తాంబ కవమానము ఘటిల్లును.

శం:-అవునవును;ముక్తాంబపురుష వేషముతో నున్నను తురుష్కులా సమాచారమెట్లు కను గొన్నారో చిత్రముగనేయున్నదే!

రా:- వారికా రహస్యము నేనే వెల్లడించితిని. లేనిచో వారికి రామయమంత్రి పై కోపము గల్గించుటెట్లు?

శం:- అట్లాగ ; నేనీజాబుగొనిపోయి మాలతికిత్తును.

రా:-మాలతివంటి వివేకవంతురాలునీభార్యయగుటనీపుణ్యమేసుమీ;త్వరలో సైన్యమునాయత్తముచేసికొనిరాయలీ దుర్గంబు ముట్టడింపవచ్చును. ఈలోగా మనమీ పనులన్నియు పూర్తి చేయనిచో యుద్ధములో పాల్గొనలేము.

శం:- అనంగసేనా ముక్తాంబల కవమానము గల్గకుండజేయుట మనవిధిగదా.

రా:-అవును; నేనుముక్తాంబ కడ కేగుదును నీవుబొమ్ము.

(తెర)

(సశేషము.)

# వస్తోంది!

శ్రీ వరుణా & మహాత్మా పిక్చర్సు వారి

# సంజారి

తారాగణం

నారాయణరావు..రుక్మిణి..జి.వరలక్ష్మి
రామశర్మ..వై.వి.రావు..మాధవపెద్ది
సి.వరలక్ష్మి..భానుమతి..శాంతాదేవి
వంగర..చెన్నూర్..లీలాబాయి



దర్శకుడు...
**వై.వి.రావు**

| కవి... | ఛాయాగ్రహణం... | సంగీతం... |
|---|---|---|
| బలిజేపల్లి.. | కోట్నిస్.. | హెచ్.ఆర్.పి.శాస్త్రి |

——డిస్ట్రిబ్యూటర్సు——

ఆంధ్ర, సీడెడ్: రాధాకృష్ణాఫిలిమ్సు, రాజమండ్రి.
మైసూర్: నందీపిక్చర్సు సర్క్యూట్, బెంగుళూరు సిటీ.
హైదరాబాదు: భగవాన్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు, హైదరాబాద్.

——ఇతర ప్రాంతాలకు——

**శ్రీ వరుణా ఫిలిమ్సు, మద్రాస్ 17**

# ఒడుదుడుకులు



పి. వి. తాతాచారి

## (సంసారంలో)

సాధారణంగా సంసారాలలో భార్యాభర్తల నడుమ భావవైరుధ్యం యేర్పడి తీరని ఒడుదుడుకులు సంభవించడానికి ముఖ్యంగా వున్న కారణాలు నాలుగు. ఆర్థికంగాను సాంఘికంగానూ, మానసికంగానూ, ఆఖరిది నైతికంగాను గృహంలో కలతలేర్పడతాయి!

ముమ్మందు ఆర్థికంగా పండువంటి సంసారాలు ఎలా కూలుతాయో ఆలోచిద్దాం!

పిల్లవాడు B. A. చదువుతున్నాడు. తల్లి దండ్రులు కట్టువాని చదువు సంధ్యలే కదా చూస్తారు! ఏదేశంపోయినా పెండ్లానికి అన్నంపెట్టి బట్టనివ్వగలడని తమపిల్లను యిచ్చి వివాహం వైభవంగా చేస్తారు, అనుకోండి! పెండ్లి అయిన మరుక్షణానో, లేక మరికొన్ని దినాలకో కట్టువాడు భార్యను తీసుకొని వెళ్లుతాడనుకోండి! తాను B. A. ప్యాసయినప్పటికీ పూర్వజన్మాన పెట్టి పుట్టనివాడయితే అరవయి రూపాయలకు మించని ఉద్యోగం దొరుకుతుంది. నిక్కచ్చిగా సంసారం చెయ్యవలసి వస్తుంది. తమయిండ్లు, తమ సంసారాలు విడిచి ఎవ్వరూ వారితోనేగ నిశ్చయించరు. వెళ్లినా చుట్టపుచూపుకు వెళ్లి తిరిగివస్తారు. అటు వంటి సందర్భాలలో వారిద్దరిని కసరి, అదమాయించడానికి యెవ్వరూ దగ్గరలో యుండరు. సాధారణంగా ప్రతీ స్త్రీవ్యక్తికి నాలుగురంగులబట్టలు కట్టుకోవాలని, నాలుగు హంగుల అలంకారాలు చేయించు కోవాలని వుంటుంది. ఇదిసహజం! భర్త తన అరవయి రూపాయలతో తనభార్య సంతోషానికి యేమటి కొని యీయగలడు? అధవా, కొనియిచ్చేడే అనుకోండి! తరువాత వారిజీవనం? ఇటువంటి సమయాలలో తమ పట్టిన పట్టు నెరవేరాలనీ యే ఆడదయినా పేచీపెడితే ఆర్థికంగా సంసారాలు కూలక తప్పదు! ఆసమయాన యింటి యజమాని ఎందుకొచ్చింది యీసంసారం, అని అనకా తప్పదు! ఇంట్లో ఆకారణంచేత సంతోషం తొలగకా తప్పదు!!!—

ఇక రెండవది సాంఘిక విషయం! సాధారణంగా సంఘములో కొంత పలుకుబడి సంపాదించాలని, అందరూ నడిచేటట్లు నడవాలని కొందరి వ్యక్తులకు వుంటుంది. కొందరికివుండకా పోవచ్చు. వ్యక్తులు స్త్రీలే అనుకోండి! లేక పురుషులే అనుకోండి! ఉదాహరణకు, భార్యతో సహా ఎకాయెకిగా సినిమాలు షికార్లు తిరిగి ఆదర్శనీయమయిన జీవితాన్ని గడపాలని పురుషునకు ఉందనుకోండి! ఇది స్త్రీకి నచ్చినచో బాధలేనే లేదు. కాని నచ్చనటులయిన యీవిషయాలలో స్త్రీ యెదురు తిరగకతప్పదు. సాంఘికంగా వారిలో కలత లేర్పడక తప్పదు. మరో ఉదాహరణ తీసుకుందాం! 'పూజా పునస్కారాలు చెయ్యడం కొంతవరకూ జీవనాన్ని ఆధ్యాత్మికముగా నడుపుదాం' అనేమచ్చులోని వాడయితే భార్య కూడా తన్ననుసరించాలని తనకు తోడుగా నడవవలెనని తనలాగే జీవితాన్ని వెళ్లపుచ్చవలెనని ప్రతిపురుషునకూ వుంటుంది. అటు వంటి సమయంలో ఆధ్యాత్మిక జీవనం గడపటానికి భార్యకు ఆవగింజంతయినా కుతూహలం లేకపోతే 'ఎద్దు ఎండకులాగా బొట్టునీడకులాగా, అన్న సామెత ప్రకారంగా వారి సంసారం మారుతుంది!

ఇంకా మూడవది. మానసిక విషయం! శరీరం ఒకప్పుడు కాకపోయినా యింకొకప్పుడు వ్యాధిగ్రస్థమవుతుంది! భర్తకు జబ్బు చేస్తుందనుకోండి! ప్రతీఆడదానికి భర్తబ్రతికి బట్టకట్టాలని వుంటుంది. జబ్బు లావయి తిరిగివస్తుందనే భయంచేత బాగయిన క్షణంనుండి కంటికిరెప్పవలె అన్నపానీయ తదితరవిషయాలలో కనిపెడుతూ వస్తుంది ఇంటి గృహలక్ష్మి. అంతవరకూ జిహ్వాచచ్చి వుండడం వలన అన్ని రుచులూ తినాలని వుంటుంది భర్తకు. భార్యను చెయ్యమని కోరతాడు. మరలిన జబ్బు తిరిగి వస్తుందన్న భయముచే భార్య నిరాకరిస్తుంది. తనమంచికై చెప్పినా భర్త 'తనుతినడం, తను ఉండడం' ఆమెకిష్టంలేదని మండిపడతాడు. ఈవిధంగా భావాలతో వైరుధ్యం కలిగి ఆ నాలుగురోజులు చీటికిమాటికి కయ్యం వస్తుంది. మరో విషయం భార్య నాలుగుపనులు చేస్తున్న సమయంలో నడకనేర్చిన పిల్లవాడింట్లో వుంటే చేతికేది అందితే అవిపంపుతూ వుంటాడు. భర్తవచ్చి 'పంపుతూవుంటే చూస్తూ వూరుకొన్నావు. ఇలా అయితే సంసారం చక్కబడ్డట్లే' అని కోప్పడతాడు. 'చూస్తూ ఏ ఆడదయినా వుంటుందా' అని ఏవో మాటలు స్త్రీ మొదలెడుతుంది, ఇక నేం, —కయ్యం చెలరేగుతుంది.

ఇంక నైతికవిషయం! ప్రస్తుతం సమయం దొరికిందనే సరికి ప్రతీవ్యక్తి యీవిషయంలో దెబ్బతింటూ వుండడం పరిపాటయింది.

అందుచేత, యిద్దరిలోనూ ఏ ఒక్కరయినా ఎదటి వ్యక్తి మనస్సును గ్రహించి సంచరించినట్లయితే ఏ ఒడుదుడుకులూలేక సంసారాలను చక్కగా నడపుకోగలరని నా విశ్వాసం! వారే సంఘంలో ఆదర్శనీయులై చిరకాలం జీవిస్తారని నా ఆశయం!!



హిందీ మూలము:
సుభద్రాకుమారి చౌహాన్

స్వేచ్ఛానువాదము:
భాషాప్రవీణ చోరగుడి హనుమత్ శేషమ్మగారు

# చంద్రావతి లేఖ

(చంద్రావతి జోధపుర ప్రభువగు యశవంతసింహుని భార్య. భర్త యొక యుద్ధమున నోడిపోయి తిరిగివచ్చినప్పుడు కోటతలుపులు మూయించెను. కోట బయటనుండి యశవంతసింహుఁడు లోనికి వార్తలంపుకొనెను. ఆమె యాతనికి సమాధానమంపుటకై లేఖవ్రాసినది.)

నాథ! కాదు - పల్కఁడు నెట్లు నాథుఁడనుచు?
తన్ను వెన్నాడ శాత్రవుల్ వెన్నుజూపి
పారివచ్చిన వాఁడేటి ప్రభుఁడు నాకు?
సధవనైయుండియు న్నేను విధవనైతి!

ఏలవచ్చితి? యంతఃపురేందుముఖుల
జిలుగు చెంగావి పావడ చెఱఁగులందు
రక్షణము నొందఁగోరితే రణమువిడిచి?
నీతియున్ జాతి యింతటి నీరసములె?

నిజమో! శూరుఁడ! నీవిట్లు నీతి దప్పి
సమర విముఖుఁడవైయుంట సైచుటెట్లు?
ఏటి పరిభవమిది? సైప కేమిజేతు;
మరణమందుట మేలిట్లు మనుటకన్న.

మరణభయమున యుద్ధమే మానుదేని
పొందితేటికి రాణాల బాంధవంబు?
కలిగితేటికి రాఠోరు కులమునందు
తులసివనమున గంజాయి మొలకవోలె?

వీరుఁడవునయ్యు శౌర్యంబు వీటఁబుచ్చి
వదనమేటికిఁ జూపంగ వచ్చితిట్లు?
అల రుమాలయె తలఁజుట్ట నపజయంబు
భళిరెఁ నీకిట చేయఁగన్ బనులుఁగలవె?

రెండుకులముల కపకీర్తి మెంచుకొనఁగ
జేసితంచును మదిని లజ్జింపవైతి;
వీరస్వర్గంబుకన్న నీవిధము మేలె
అకట, లోచ్చొకో యశము దేహంబుకన్న?

కలిగియుంటిని రాణాల కన్యనగుచు;
వీరబాలనుగా కొంత వినుతిగొంటి;
ఎట్లుచూతును నీముఖం బేను నేడు?
చూడకెట్లుందు? నెటుబోదు? పాడియెదియొ?

యుద్ధరంగాన వీరుఁడై యుండితేని
పొందియుందువు యశముల నందునిందు;
భర్తృగామిని నైయుందు భాగ్యమనుచు;
క్షుభితనగుదునె సుంతైన శూన్యహృదయ?

నాదుభాగ్యము నందట్లు లేదొయేమొ?
దుర్విధీ! యిట్టిదే నీదు దుష్టబుద్ధి;
నాదె భ్రమగాక, విధినేర మేదియుందు
కల్గు విశ్వాస మది యలీకంబుగాక.

అమ్మ! మేదిని మార్గమ్ము నిమ్ము దేవి!
దుర్యశంబను పంకంబు దుడుతు; మరల
జన్మమందితి నేని యీ జగతి పిరికి
పందయౌ వానిపత్నిఁ గాకుందుగాక!

కాదు - కాదిది; నే భీరు కాంతనైన
వేరయెవ్వతె జగతిని వీరపత్ని;
వంశమర్యాద ద్రుంగిన వాఁడవీవు
కలిగియుండియు నాకెట్లు కాంతుఁడౌదు?

వీరుఁడంచను నినుఁగూర్చి వింటినాఁడు
హృదయమిచ్చితి, యుత్సాహమిట్టులగునె?
నాటిపల్కులు నీటిలో మూటలగుట
నేడెఱింగితి కలహాపు నిశ్చయముగ.

ఇందుసఖమగు మోమును నందమైన
ఫాలభాగము నాజాను బాహువులును
విప్పటురముచు నొప్పుల కుప్పతనము
చిత్రకారుని చిత్రంపు చెలువె యౌర!

జోధపురమున శౌర్యంబు శూన్యమగునె;
సింహవాసంబు నక్కకుం జేరఁగలదె;
ఇచటస్థానము గలదె నీ కించుకైన
పొమ్ము పొమ్మింక రాష్ట్రంబు పురమువిడచి.

సైపఁగూడని సంక్షోభ సమయమగుట
ఎఱిఁగి చేసితి నిట్టుల నేనవజ్ఞ;
కాని క్షత్రియ కన్యనై మానఁగలనె
పలుకకుండఁగ సత్యంబు పరుషమనుచు.

కలుగ దింకిట వానితోఁ గలిమి దేవ!
ఆర్పవెరవేది ప్రతాప మగ్నివోలె
ఏర్చుచున్నది హృదయమో యీశ. నీదు
పాదమూలము జేర్చు మీ బ్రతుకునొల్ల.

# సతీత్వము - లేక - సాధుశీలము

శ్రీమతి ఓరుగంటి సీతమ్మగారు



"సతీ, సాధ్వీ, పతివ్రతా" అని అమరసింహుడు నుడివెను. సాధుశీలముగలది సాధ్వి. అనగా సన్మార్గగామియగు నొక స్త్రీ. వనిత తన భర్త చెప్పినట్లు విని పెద్దలు మెచ్చసద్వర్తనగలదిగాయున్న ఆమెను సాధుశీలయనియు, సతీతిలకమనియు నందురు. ప్రపంచమందు ప్రతివారును స్త్రీసాధ్విగాఁ బ్రవర్తింపవలెనని యుపన్యాసమిత్తురు. అందుకు మగవారు తమ నడవడికను బాగుచేసుకొనవలెను. పూర్వకాలమువారు స్త్రీల కనేక విధములైన నిబంధనలు జెప్పిరిగాని తాము దానికి చాలా వ్యతిరేకముగానే ప్రవర్తించిరి.

కవులుగూడా పతివ్రతలను వర్ణించవలసిన సమయములందు వారిభర్తలను నీచులగాను, దుర్మార్గులగాను సృష్టించిరి. అట్లు సృష్టించినగాని వారి యుత్కృష్టత బాగుగాఁ దెలియదు. సుమతి! భర్త వేశ్య పొందు కోరగా పాపమామె యభిమానమును గంగపాలు జేసుకొని వేశ్యను ప్రార్థించి భర్తయభిమత మీడేర్చెను. అట్టి పతిభక్తి పరాయణగాబట్టే సూర్యోదయమును గాకుండ జేయగలిగెను. అంతకుమించిన మహాత్మ్యాలననూయ. త్రిలోకాల నుయ్యాలనూగించే త్రిమూర్తుల నుయ్యాలలో నూగించెను. పర్వత రాజపుత్రి భస్మమైన మన్మధుని మరల సజీవుని చేయించింది భర్తచేత. సుకన్య, ముదసలియగు తన భర్తకు యవ్వనము గలుగఁజేసెను. సాధ్వి చేత కానిదేది?

## శ్రీనాధుఁడు

కాంతుఁడు సంతోషించిన సంతోషింపంగవలయుసతి కతడాత్మన్
సంతాపించిన పట్టున సంతాపింపంపగ వలయు జలజేక్షణకున్ ... కాశీఖండము.

భర్త సంతోషించిన సంతోషింపవలెనట; దుఃఖముతోనున్న సమయమున దుఃఖించవలెనట. అవును ఒక కుటుంబములోనివారు సంతోషవార్త విన్ననందఱు సామాన్యముగా సంతోషింతురు. అట్టియెడ నర్ధ శరీరముగొన్న యిల్లాలు సంతోషింపకెట్లూరకుండును? అట్లే దుఃఖసమయముల దుఃఖము సగము పంచుకొనును. కాననే

"కార్యేషు దాసీ కరణేషుమంత్రీ రూపేషులక్ష్మీ క్షమయాధరిత్రీ
భోజ్యేషుమాతా శయనేషువేశ్యా షట్కర్మ యుక్తా కులధర్మపత్నీ ..."

అని అన్నారు. ఇన్ని విధములుగా భార్య భర్తకు సహకరించి సంతోషపరుపవలెను. భవభూతి "గేహలక్ష్మి" యని యనెను. గృహమునకు వనితలక్ష్మి వంటిదిగదా.

అట్టి కాంతను మనస్సునొచ్చు మాటను సైతమనరాదు.

కులకాంతతోడ నెప్పుడు; కలహింపకు వట్టితప్పు ఘటయింపకుమీ
కలకంఠకంటి? కన్నీరొలికిన సిరియింట నుండనొల్లదు సుమతీ!"

కానిఅట్లులని భర్త (భరియించువాని) మాటకెదురాడి వారొకటన రెండని వారిచేత

## సతీత్వము - లేక - సాధుశీలము

"అమ్మకు రెండవబ్బకు రెండిమ్మహి దిట్టించు కూతు రెండుకు ధరనా
ద్రిమ్మరి పుట్టక పోయిన నెమ్మది మరి హాయి. —— ...." కుమారీశతకము.

అని యనిపించుకొనఁగూడదు.

"నస్త్రీస్వాతంత్ర్యమర్హతి"

స్త్రీలకు స్వాతంత్ర్య మర్హము గాదట! ఈస్వాతంత్ర్య మెంతవరకుఁ దగదో? భర్త నెదిరించి ప్రవర్తించుదురని యా యాకట్టుబాటు! సాధ్వియగు స్త్రీ భర్త యభిమత మెట్లేగునో దెలుసుకొని తదనుసారిణియై యుండవలయునని వారి యుద్దేశమై యుండనోపు. భర్తను దనయిష్టప్రకారము బ్రవర్తింపఁజేయు పతివ్రతల మాటయేమి! వారితరవిషయముల నేవిధగాను దోషులుగారు.

కాని తమ సామర్థ్యమువలన తమ భర్తను తమ యభిమతముల ప్రకారము ప్రవర్తింపఁ జేయుదురు. ఇది దోషమనుటకు వీలులేదు. భర్తకు సేవచేయుచు ప్రపంచమును మఱచుట మేలా! గృహము లేకదా పంగ్వంధ బధిరపాంధులకు కల్పవృక్షముల వంటివారు. వనిత, "తమ కాయము వ్యం తమ కారోగ్యమ్మన్న" ట్లుండిన మేలా? అదేసాధ్వీ మతల్లి ప్రవర్తన మన్న లోకము మెచ్చునా? అట్లని అతిథి యభ్యాగతులను సేవించుచు భర్త మాట మరచునదియు మంచిదిగాదు.

"పతికి ప్రత్యక్షదైవంబు పతియు కాదె," అన్నట్లు పతియే ఆమెకు సర్వస్వము. కాని అతిథి యభ్యాగతుల నాదరించుట యామె విధి. లోకమున పేరు ప్రతిష్టలు పొందవలెనన్న సాధుశీలమే సతికి భూషణము.

ప్రతి స్త్రీ జన్మముతోనే సాధుత్వమునుగానీ, దుర్మార్గమునుగానీ, యలవఱచుకొని పుట్టుటలేదు. తల్లిదండ్రులవలనను, స్నేహితురాండ్ర సాహచర్యమువలననూ, భర్తనడవడికవలననూ, మంచిచెడుగులలవడును. కావున స్త్రీలకు విద్యయవసరము. విద్యరానివారు సచ్చరిత్రలుగారా! విద్యనభ్యసించిన వారిలోఁ జెడినవారు లేరాయనవచ్చును. అన్నిటకి లోకజ్ఞానము ప్రాధాన్యము. దానివలన యుక్తాయుక్త వివేచన కలుగును. విద్యావతియైన, తాను చేయు కార్యము మంచిదా చెడ్డదా యను వివేక ముండును. కాని పూర్వజన్మ పుణ్యపాపముల ప్రకారము ప్రవర్తించును. భారతదేశ మందన్ని ధర్మములకంటే పాతివ్రత్యమే యెక్కువ ప్రాధాన్యత నందినది. పతివ్రతకందఱు భయపడువారే. సాధ్విని సరకుగొనక మాట్లాడిన వారరుదు. ఏమి శపించునోయని గడగడలాడినవారే! కాలము మారినది. ధర్మము మారినది. గుణములు మారకుండునా? ఇప్పటికిని పుట్టినింటికి మెట్టినింటికి మంచిపేరుదెమ్మని క్రొత్తగా నత్తవారింటికిఁ బంపు తలిదండ్రులు తమ పుత్రికలను నొక్కి వక్కాణింతురు. శ్రీనాథుఁడు, పతివ్రతయగు వనిత

"తండ్రివంశంబునం దేడుదరములకును తల్లివంశంబునం దేడుదరములకును
ధవునివంశంబునం దేడుదరములకును శాశ్వతస్వర్గ సౌఖ్యమీజాలుసాధ్వి"

—కాశీఖండం

మూడువంశములవారికి స్వర్గసౌఖ్య మీజాలునట సాధ్వి! కారణము సాధుశీలము. కాన సతీత్వమే స్త్రీల కాభరణము. ప్రపంచమునకు మంగళకరులగు మానవతులు తాము సాధుశీలలై లోకకళ్యాణమునకు పాటుపడుదురుగాక యని కోరుచున్నాను.

# లక్ష్మీగౌరిసంవాదము

ల:- గౌరి దేవి నీశంభు దేవునకు గళమున నలుపేమమ్మా; బల్ గళమున నలుపేమమ్మా?

గౌ:- నారీమణి నీ విష్ణు దేవుడు నలుపు గాదటె కొమ్మా!

ల:- హద్దు లేక నీ పెనిమిటికి సగమాడ రూపు యేమమ్మా; సగమాడరూపు యేమమ్మా?

గౌ:- ముద్దుగుమ్మ నీ కాంతుడు జగన్మోహిని గాదటెకొమ్మా!

ల:- పంకజాక్షి నీశంకరు కరమున జింకయున్న దేమమ్మా; బల్ జింక యున్న దేమమ్మా?

గౌ:- శంకలేక వనవాసము జేయుచు జింక నేయడా కొమ్మా!

ల:- పార్వతి నీ విభునిశిరస్సున పాములున్న వేమమ్మా; బల్ పాములున్న వేమమ్మా?

గౌ:- కంబుకంఠి నీ కాంతుడు పన్నగ శయనుడు గాదటె కొమ్మా!

ల:- బిరుదులేక నీ పెనిమిటి జగతిని భిక్షమెత్తె నేమమ్మా; బల్ బిక్షమెత్తెనేమమ్మా?

గౌ:- బలము లేక బలిచక్రవర్తిని అడగ లేదటె కొమ్మా!

ల:- ఏమిలేక నీ పెనిమిటి ముసలెద్దు నెక్కెనేమమ్మా; ముసలెద్దు నెక్కెనేమమ్మా?

గౌ:- విందుములే నీ విభుడు బాగుగా పసల గాయడా కొమ్మా!

ల:- ఓ గిరిజా నీ కాంతుని శిరసున గంగయున్న దేమమ్మా; బల్ గంగయున్న దేమమ్మా?

గౌ:- చంచలాక్షి, నీ పెనిమిటి పదమున గంగలేదటె కొమ్మా!

ల:- ముద్దుగుమ్మ నీ పెనిమిటిముఖమున మూడవకన్నేమిటమ్మా; బల్ మూడవ కన్నేమిటమ్మా?

గౌ:- సింహమధ్య నీ పెనిమిటి నారసింహుడు గాదటె కొమ్మా!

ల:- లలనామణి నీ పెనిమిటిమేనున భస్మమేమిటె కొమ్మా; బల్ భస్మమేమిటేకొమ్మా?

గౌ:- పంకజాక్షి నీ కాంతుని ఒంటిని మంచిగంధములేదా!

# లోక వార్తలు



పాకిస్థాన్ వారు తయారు చేసిన "కాశ్మీరసమరము" భారతదేశంలో తయారైన "కాశ్మీరగాథ" అనే రెండు ఫిలుములు లండన్‌లో విడివిడిగా ప్రదర్శింపబడుతున్నవి. అనంతరం కలిపి ప్రదర్శించాలని అచ్చటి అధికార్ల ఉత్తరవు. ఈ రెండున్నూ ఆయా దేశాల దృక్పథాలను ప్రచారం చేశేవి.

♦ ♦ ♦

ఢిల్లీనగరంలో జయ అప్పాస్వామికన్య భారత చీనా చిత్రలేఖనముల ప్రదర్శించినది. ఆమె భారత ప్రభుత్వము వారి యాజమాన్యమున చీనా వెళ్ళి అచ్చట రెండున్నర సంవత్సరములుండి, చీనా చిత్రకళ నభ్యసించి కొలది వారముల క్రిందటనే తిరిగి మనదేశమునకు వచ్చియున్నది.

♦ ♦ ♦

ప్రపంచంలో ఉన్న నత్తివాండ్ర సంఖ్య దాదాపు 225,00,000 అని అంచనా: అంటే 100 కి 1 డు. ఈ నత్తికి మూలమేదో అమెరికన్ శాస్త్రజ్ఞులు తెలుసుకుంటున్నారు! పూర్తిగా తెలిసిన తరువాత నివారణోపాయాలు కూడా కనుక్కుంటారు.

♦ ♦ ♦

మద్రాసు ప్రభుత్వమువారు ప్రాథమిక పాఠశాలల్లో బాలుర పాఠశాలలు, బాలికా పాఠశాలలు అనే విభేదము తొలగిస్తూ ఉత్తరువులు చేశారు. హైయర్ ఎలిమెంటరీ స్కూళ్ళుమాత్రము తగినంత మంది బాలికలుంటే వేరు వేరుగా ఒక సెక్షనుల నుంచవచ్చు అన్నారు. వీలైనంతవరకు అట్టి బాలికల సెక్షన్లకు ఉపాధ్యాయినులను బోధ చేయనున వచ్చు. జీత భత్యాలవిషయం ఉపాధ్యాయులకు, ఉపాధ్యాయినులకు ఎట్టిభేదము ఉండరాదు అని కూడా ప్రభుత్వమువారి ఉత్తరువులు.

♦ ♦ ♦

మాంబళం నందలి శివ విష్ణు దేవాలయంలో పురుషసూక్త హోమమున్ను అతిరుద్రమహా యజ్ఞమున్ను ప్రపంచశాంతికై ఈమాసంలో జరిగాయి. కలకత్తా విశ్వవిద్యాలయంలో సంస్కృత పండితుడుగానుండిన అనంతకృష్ణ శాస్త్రి అధ్వర్యం వహించారు

♦ ♦ ♦

నేతాజీ 1941 లో ఒక ఆస్ట్రేలియన్ యువతిని పెండ్లాడినాడట; ఆమెకు ఒక ఆడబిడ్డ కలిగిందట. ఆ బిడ్డకిప్పుడు 8 సం॥లు స్విడ్జర్లండులో చదువుకుంటున్నది. పటేలు ఆమెకు డబ్బు పంపేవాడట. నెహ్రూ ఆమెను భారతదేశానికి రమ్మంటే స్విడ్జర్లాండులోనే ఉంటానన్నదట.

♦ ♦ ♦

ఉప్పు వ్యాపారమును కేంద్ర ప్రభుత్వమే నిర్వహించ నిర్ణయించినట్లు తెలియుచున్నది. సహకార స్టోర్సునందు, రేషను దుకాణములందు ఉప్పును అమ్మించవలెనని రాష్ట్ర ప్రభుత్వములు ఆదేశించినవి.

♦ ♦ ♦

శ్రీ నేతాజి సుభాస్ చంద్రబోసు యొక్క చితాభస్మము, లేక అస్థికలు జపానులో ఒక ఆలయమునందున్నవని తెలిసినందున జపానునందలి భారత ప్రభుత్వ ప్రతినిధిని దర్యాప్తు చేయవలసినదిగా కోరడమైనది.

♦ ♦ ♦

అంతర్జాతీయ శిశుపోషణ నిధితరఫున ఇప్పుడు ప్రధానంగా ఆగ్నేయ ఆసియాలో మాతా శిశు సంరక్షణకోసరం ఎంతైనా కృషిజరుగుతోంది; ఈ పనికిగాను కోటి డాలర్లు వెచ్చింప బడుచున్నవి.

♦ ♦ ♦

వాషింగ్టన్ నందలి భారతీయ రాయభారి శ్రీమతి విజయలక్ష్మి పండిటు రాజీనామా వార్త నిరాధారమైనదనియు, రాజీనామ నిచ్చు ప్రశ్న ఉదయించలేదని భారత ప్రభుత్వ విదేశ శాఖవారు ప్రకటించారు.

♦ ♦ ♦

ఏప్రిలు, మే, జూన్ మాసములలో మన దేశమందలి బట్టల మిల్లులు ఉత్పత్తిలో 100 కి 10 కంటె ఎక్కువగా ఎగుమతికి ప్యాకు చేయరాదని ప్రభుత్వము ఉత్తరువు చేసినది. ఇందువలన మిల్లు గుడ్డల ఉత్పత్తిలో 100 కి 90 వంతులు దేశీయ వినియోగమునకు లభ్యమగును.

♦ ♦ ♦

పశ్చిమ గోదావరి జిల్లా యందలి నడిపూడి గ్రామములో సెక్కంటి సత్యవతమ్మ గారి యింటిపై మార్చి 24 తేదిన రాత్రి 30 మంది కమ్యూనిస్టులు దాడిచేసి పదివేల రూపాయిలు రొఖము, కొంత బంగారమును దోచుకొన్నట్లు తెలియుచున్నది. దోచికొని పారిపోవుచుండగా వారికి, కాపలా వారికి జరిగిన ఘర్షణలో ముగ్గురు కాపలా వారికి గాయములు తగిలినవట.

♦ ♦ ♦

మధ్యభారత అసెంబ్లీలో ప్రసంగించుచు శ్రీ హేమరాజ్ పార్వల్ గారు సెల్నాయను తన గ్రామమున హరిజనులను మంగళ్లు నిషేధించగా సేఫ్టీ రేజరుతో తాను స్వయంగా 25 మందికి క్షౌరము చేసినట్లు చెప్పిరి.

♦ ♦ ♦

ఈమార్చి 22 వ నాటిరాత్రి కమలాపురం చెరువులో 55 సంవత్సరముల పురుషుడు, 20 సంవత్సరముల అతని ద్వితీయ కళత్రము కొంగులు కట్టుకుని నీటిలో పడి ఆత్మహత్యలు గావించుకొనిరి. పురుషుడు ధారవాడజిల్లా అణిగి గ్రామవాసి. చాలా కాలముగా కడుపునొప్పితో బాధలు పడి, పడి, కొంతకాలము పాటు హంపీ విరూపాక్షుని సేవించి, చివరకు మొన్న ఆత్మహత్యకు ఉద్యమించెనట. అతని భార్య కూడా అతనితో సహగమించెను. ఆలు మొగల శవములు పెనవేసుకొని యున్నవి.

♦ ♦ ♦

పూనాలో విక్టోరియా హైస్కూలు స్థాపించిన డాక్టరు అలీసు పానెల్ మార్చి నెల 7 వ తేదీని స్వర్గస్తురాలైనది. ఈమె సరిహద్దు రాష్ట్రమున నొనర్చిన సేవకు కెయిసర్ హింద్ మెడలు పొందెను. సెయింటుజాన్ అంబులెన్సు అసోసియేషను మాన్యువలును మనదేశమున కనుగుణ్యంగా ఆమె సవరించి యున్నది.

♦ ♦ ♦

శ్రీ అరవిందయోగి జ్ఞాపకార్థముగా అంతర్జాతీయ విశ్వవిద్యాలయమును స్థాపించెదరట. అందు నానా దేశములనుండి విద్యార్థులువచ్చి విద్యాభ్యాసము చేయుటకు వసతులుండును. ఇందుకు గాను ఏప్రిలు నెల 24, 25 వ తేదీలలో పుదుచ్చేరియందు డాక్టరు శ్యామ ప్రసాద్ ముఖర్జీగారి అధ్యక్షతను జరుగును.

♦ ♦ ♦

డాక్టరు రాయి అనే వ్యక్తి స్త్రీ గుమాస్తాలు కావాలని ప్రకటించి వచ్చినవారిలో ఒక యువతిని వైద్యపరీక్షకని చాటుకు పిలచి మానభంగ మొనర్చెనని ఆమె ఫిరియాదు చేయగా కేసు నడుచుచున్నదట.

♦ ♦ ♦

తిరుపతి దేవస్థానం కమిటీవారు ఈక్రింది తీర్మానాలు చేశారు. తిరుపతి కొండకువచ్చే విద్యార్థి యాత్రికులకు మూడవ వంతు బస్సుచార్జి తగ్గింపబడును. గర్భగుడిలో కులశేఖర పాద విగ్రహమునకు బంగారు పూత పూయబడును. తిరుపతిలో గల 70 ప్రైవేటు బావులలో ప్రయాణీకుల వాడుకకై విడువబడు వానికి కమిటీ ఖర్చుపై పూడిక తీయబడును. మలేరియా నిర్మూలనచర్యలకు 11200 రూ|| లు ఖర్చు చేయబడును.

# అమూల్య రత్నాలు : వజ్రములు :

శ్రీ వసంతరావు వెంకటరావుగారు

రత్నాలు చాల విలువైన వస్తువులు. 'పిట్ట చిన్నదైనా కూత ఘనమే' అన్నట్లు, రత్నాలు చిన్నవైనప్పటికి వాటి ఖరీదు ఎక్కువే! రత్నాలలో ప్రసిద్ధికెక్కినవి తొమ్మిది రకాలున్నాయి, వాటినే నవరత్నాలంటారు. అవి : ముత్యం, మాణిక్యం, వైడూర్యం, గోమేధకం, వజ్రం, విద్రుమం, పుష్యరాగం, మరకతం, నీలం. వీటిలో ఏ ఒక్కటీకూడా సులభంగా దొరకదు. ఎంతో కష్టపడి, డబ్బు ఖర్చుపెట్టి, వాటిని పైకితీయాలి. వాటిలో వజ్రాల గురించి తెలిసికొందాం.

వజ్రాలు ధగధగ మెరుస్తూంటాయి. వాటితో ఆభరణాలు చేస్తారు. రాజుల కిరీటాలలోను, దేవతా విగ్రహాలకు వేసే ఆభరణాలలోను పూర్వకాలం వజ్రాలను పొదిగేవారు. ఇప్పుడైతే, వాటిని విరివిగా వాడుతున్నారు. వజ్రాలతో ఉంగరాలు, ముక్కుపుడకలు, తమ్మెట్లు, కంఠహారాలు, చేమంతిపూలు మొదలైనవెన్నో చేస్తారు.

మొట్టమొదటి వజ్రాలు మన భారతదేశంలోనే దొరకినవి. గోల్కొండ వీధులలో రత్నాలు కుప్పలు కుప్పలుగాపోసి అమ్మేవారట. దేశదేశాలనుండి వర్తకులువచ్చి కొనుక్కొని పోయేవారు. ఆంగ్ల రాజుల కిరీటంలోనున్న కోహినూరు వజ్రం మనదేశంలోనిదే.

వజ్రాలు భూగర్భంలో నుంటాయి. పలకలు పలకలుగానున్న స్ఫటికాలవి. ఎంతో వేడిగానున్న భూగర్భంలోనుండి ఆ వేడికి, ఒత్తిడికి మెల్లమెల్లగా పైకితోసికొని వచ్చేయంటారు వజ్రాలు. అట్లు వస్తూన్నప్పుడు భూమిలోని నీరు, మట్టి, రాయి, గట్టిరాయి పొరలలోనుండి పైకిరావాలి. వందలు, వేలు, లక్షలుకొలది యేండ్లు ఆ విధంగా పైకివస్తూన్నప్పుడు ఒక ప్రక్క కోనుగాను, పలకలు పలకలుగాను ఏర్పడుతుంది. భూమిలో కొన్ని వేల అడుగులవరకువచ్చి ఆగిపోతాయి. అవే వజ్రపుగనులు. గనులను త్రవ్వి వజ్రాలను సంపాదిస్తారు. అగ్నిపర్వతాలదగ్గర ఎక్కువగా వజ్రపుగనులుంటాయి. ఏమంటే, అగ్నిపర్వతం పగిలి, దానిలోనుండి లావా ప్రవహించినప్పుడు అందులో చిక్కుకొంటాయి.

ఎంతో విలువైన వజ్రాలు నిజానికి బొగ్గుతో సమానమంటే ఆశ్చర్యంకాదూ? కాని, బొగ్గు, మసి, వజ్రాలు ఒకే జాతివి; సందేహంలేదు. అయితే బొగ్గు నల్లగాను తేలికగాను ఉండడానికి, వజ్రాలు జిగజిగ మెరుస్తూ, బరువుగాను గట్టిగాను ఉండడానికి కారణమేమంటే వాటిలోనున్న చిన్న చిన్న కణాలైన పరమాణువుల ఏర్పాటులోగల భేదమే. మీరు క్లాసులో బెంచీలమీద కూర్చున్నప్పుడు ఒక ఏర్పాటులో నుంటారు; డ్రిల్లు చేస్తూన్నప్పుడు బారులుతీర్చి వరుసవరుసలలో నిలుచుంటే ఒకేసారిగా

అందరూ చేతులుజాచినప్పుడు మరొక ఏర్పాటులోనుంటారు. ఆ ఏర్పాటు చూడడానికి ఎంతో అందంగానుంటుంది. ఇట్టి భేదమే బొగ్గులోనున్న పరమాణువులకు వజ్రంలోనున్న పరమాణువులకు ఉండుటచేత వజ్రం గట్టిగానుండడం. అయితే, బొగ్గును వజ్రంగా మార్చలేమా అంటారేమో? మార్చ కలిగితే చాలా మంచిదే. బస్తా బొగ్గులు ఐదురూపాయలైతే బస్తా వజ్రాలు కోట్లకొలది రూపాయల విలువుంటాయి. కాని, ఇప్పటివరకు అది సాధ్యం కాలేదు. ఆ ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. 45 ఏండ్ల క్రిందట ఒక తమాషా జరిగింది. లండన్‌లో వజ్రాల వర్తకుడుగానున్న సర్ జూలియస్ వెర్నెహెర్ వద్దకొక పారిస్ దేశస్థుడైన హెన్రీలిమోయ్ వెళ్లి, కృత్రిమంగా వజ్రాలు చేస్తానన్నాడు. అది సాధ్యం కాదని తెలిసినప్పటికి ఆశచేత వెర్నెహెర్ పారిస్ వెళ్లి, లిమోయ్ పరిశోధనాగారంలో అతడుచేసిన ప్రయోగంచూసేడు. నిజంగా వజ్రం తయారైంది. బొగ్గుతో మరొకసారి ప్రయోగంచేయగా, మళ్లా వజ్రం తయారైంది. సరే, ఇది చాల బాగుందని వజ్రాల ఫ్యాక్టరీ కట్టడానికై లిమోయ్‌కి మూడులక్షల ఇరవైవేల డాలర్లు, అంటే, సుమారు పదిహేనున్నర లక్షల రూపాయల కొక చెక్కును వెర్నెహెర్ ఇచ్చేడు. ఆ డబ్బు పుచ్చుకొన్నందుకుగా, వజ్రాలను తయారుచేసే సూత్రాన్నివ్రాసి, కవరులోపెట్టి ఒక బ్యాంకులో దాచిపెట్టేడు. మూడేళ్లు గడచినా వజ్రాలు తయారుకావు. వెర్నెహెర్‌కి అనుమానం వేసింది, లిమోయ్‌ని ఖైదులో పెట్టించి, మోసగించినందుకు దావా తెచ్చేడు. తుదకు, లిమోయ్ వ్రాసిన సూత్రాన్ని చూడగా ఏముంది : బొగ్గు పంచదారకలిపి ఒక మూసలోపోసి దానిని విద్యుత్ప్రవాహంతో బాగా వేడిచేసి, దానిపై ఒత్తిడి కలిగిస్తే వజ్రాలు తయారౌతాయని ఉంది. పాపం, వెర్నెహెర్ మోస పోయేడు; డబ్బుకూడా నష్టపోయేడు. మొదటిసారి వజ్రాలనుదాచి తయారుచేసేనని లిమోయ్ చెప్పేడు.

అంటే, భూగర్భంలో ఎన్నో సంవత్సరాలు వేడికి ఒత్తిడికి చిక్కిన బొగ్గు వజ్రంగా మారినప్పటికి, మనం బొగ్గుని ఆ విధంగా మార్చలేము. లావాతో పైకివచ్చిన వాటిలో కొన్ని వజ్రాలు నదులలో కొట్టుకొని వస్తాయి. వజ్రంకంటె గట్టివస్తువులేదు. వజ్రాన్ని వజ్రమే ముక్కలుచెయ్యాలి. ఎంత గట్టిగా వజ్రాన్ని చితుకగొట్టినప్పటికి ఆ ముక్కలు సూదుల్లాగ ఉంటాయేకాని, మెత్తగా పొడిగాదు. ఆ గట్టితనమే వజ్రంయొక్క ముఖ్యలక్షణం. లోహాలను, పాషాణాలను కొయ్యడానికి వజ్రపు తునకలెంతో ఉపయోగిస్తాయి. పరిశ్రమలలో వాటి ఉపయోగానికి మితిలేదు. భూమిలో నూనె, బొగ్గు ఎక్కడుందో తెలిసికొనడానికై నిలువుగా కన్నాలు చెయ్యాలి. దానికై వజ్రపు కొనలున్న బర్మాలనుపయోగిస్తే, ఎట్టి పాషాణాలైనా ఇట్టే పిప్పిపిప్పి అవుతాయి. ఆ కారణంచేత చిన్నచిన్న వజ్రాలకుకూడా విలువుంది.

(సశేషము)

---

తూర్పు బంగాళం ఒక గ్రామంలో ఆలు మగలు తగవులాడుకున్నారు అర్ధరాత్రప్పుడు ఆ కలహం కంఠి మాటలతో సరిపుచ్చుకోక చేతిలో వెలుగుతూన్న దీపపు బుడ్డిని భర్తమీదికి విసిరివేసింది అయన పడుకున్న మంచపు దోమతెర అంటుకున్నది. దాంతో ఇల్లంటుకున్నది. ఆ వెంటనే ప్రక్కనున్న కిర్సనాయిల్ డిపో అంటుకున్నది. ఆఖరుకు ఆవీధంతా పరశురామప్రీతి అయింది.

—(o)—

# సంపాదకీయములు

## ప్రపంచంలో జనాభా అభివృద్ధి

ప్రపంచంలో జనాభా గత 30 సంవత్సరాలలో - 183,40,00,000 నుండి 237,30,00,000 దాకా పెరిగినది. అంటే సాలీనా 100 కి 1 వంతున పెరుగుతున్నది. ఈ పెరుగుదలకు కారణమైన మాతృదేవతలకు జోహారు లొనర్పదగును. అయితే జనాభా వృద్ధితోపాటు వారు వినియోగించే నిత్యావసర పదార్థములుకూడ వృద్ధిఅయిననాడే ఆ మాతృదేవతలకుతృప్తి; ప్రపంచ శాంతి. లేనినాడు ఉన్న దానినే వశంచేసుకొనుటకై యుద్ధాలు అనివార్యమవుతున్నాయి. 1949 అంచనా ప్రకారం చూస్తే విశాలమైన ఆఫ్రికా ఖండంలో జనం 20 కోట్లకు తక్కువే. ఆసియాలో 125 కోట్లున్నా అది విశాలమేగాక బహుళమైన నైజ సంపత్తితో కూడుకొనియున్నది. యూరపు ఖండము మాత్రము దరిదాపు 60 కోట్ల మందితో క్రిక్కిరిసి యున్నది. అమెరికాయు సువిశాలమై 30 కోట్ల మందితో అలరారుచున్నది. యూరపు క్రిక్కిరిసి యున్నందుననే కొట్టుకొని తినడానికి తెల్లవారు అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండాలలో ఇదివరకే చేరియున్నారు. అమెరికా ఆస్ట్రేలియాలలో సుస్థిర ప్రభుత్వాలేర్పడి ఇతరలనురానిచ్చే విషయమై నియమ నిబంధనలేర్పరచి యున్నారు. ఆఫ్రికాలో ఏర్పడిన దక్షిణాఫ్రికా ప్రభుత్వము రంగుజాతులరాక నేవగిస్తున్నది. ఈ పరిస్థితులు తొలగాలి. ప్రపంచమంతా సర్వజనభోజ్యమనే ధర్మసూత్ర మేర్పడవలెను. ప్రపంచ మేకఖండమై ప్రపంచవాసులంతా ఏకపౌరులై, విభేదములు లేకుండా అందరికీ అనుకూలమైన ఏర్పాట్లు ఏర్పడి ప్రపంచమందలి నైజసంపదను అందరు అభివృద్ధిపరచి అనుభవించుటకు అవకాశా లేర్పడవలయును. ఈ ధర్మ సూత్రాలను ఈ జనాభాను కనిపెంచే తల్లులుగ్గుపాలతో నేర్పితేనే క్రమంగా ప్రపంచపౌరసత్వ ధర్మము లేర్పడి అమలుజరిగి ప్రపంచశాంతి యేర్పడగలదు.

## రానున్న శాసన సభల ఎన్నికలు : స్త్రీలు.

త్వరలో శాసనసభల ఎన్నికలు రానున్నవి. క్రొత్తరాజ్యాంగచట్టం ప్రకారం ఈ జరిగే ఎన్నికలలో వయోజనులంతా ఓటుచేస్తారు. అంటే దాదాపు 7, 8 కోట్ల స్త్రీలు ఓట్లు వేస్తారు. కాబట్టి స్త్రీల కర్తవ్యము ఆలోచనీయము. ఈ విషయంలో అఖిలభారత మహిళామహాసభవా రప్రమత్తులై లేరని వారి ప్రధాన కార్యదర్శిని శ్రీమతి బి. కామేశ్వరమ్మగారు పూనాలో చెప్పినదానినిపట్టి తలంచవలసియున్నది. ప్రస్తుతం శాసన సభలలో 100 కి 2 కంటే శాసన సభ్యురాండ్రులేరు. ఈ సారి ఎన్నికలలో 10 దామాషాయైనా యేర్పడవలెనని కామేశ్వరమ్మగారి కోరిక. ఈ కోరిక పరిమితమైనదే. అయితే అసలుసమస్య అదికాదు. శాసన సభలలో స్త్రీ సభ్యురాండ్రెక్కువైనందువల్ల సభలు సరసంగా సాగితే సాగవచ్చు. కాని నిజంగా కావలసినది అభ్యర్థులు ఆలోచించి వోటర్లకు హామీ నిచ్చుటకు తగిన స్త్రీ జనాభ్యుదయ కార్య ప్రణాళికయే. అప్పుడు శాసన సభ్యులు స్త్రీలైనా పురుషులైనా వకటే. మహిళాసభ వారా విషయంకూడ ఆలోచిస్తున్నట్లే తోస్తున్నది. రాజకీయ పక్షములన్నిటికి పంపను ఒక విజ్ఞాపన తయారు చేయనున్నారుట. ఈ సందర్భమున మే మొక్కమాట చెప్పదలచితిమి. ఈ ఉద్యమ పరాయణులైన నారీమణులు చాలవరకు విద్యాధికురాండ్రు; కేవలము ధనాఢ్యులు కాకపోయినా మధ్యతరగతిలో పై అంతస్థుకు

చెందినవారు. వారి సమస్యలువేరు. సామాన్య స్త్రీల సమస్యలువేరు. కావున ఈ విజ్ఞాపన ఆ సామాన్య స్త్రీల సమస్యల పరిష్కరించునదై ఉండవలెను. త్వరలో నీ విజ్ఞప్తి వెలువడుగాకయని కోరుచున్నాము.

## ఉగాది కానుక

మద్రాసు ప్రభుత్వమువారు ఈ 8.వ తేదినుండి 7 ఔన్సుల రేషన్ 8 ఔన్సులకు హెచ్చించి రాష్ట్రివాసులకు చక్కని తెలుగు ఉగాదికానుక నొసంగినారు. రాష్ట్రిముఖ్యమంత్రి తమిళ దేశస్థుడైనా తెలుగువాడైనందుకు తెలుగు సంవత్సరాదిని చక్కగా గౌరవించినాడు. 8 ఔన్సుల బియ్యంతోపాటు 1 ఔన్స గోధుమలును ఇస్తారుట. ఈరెంటిని పొదుపుగా ఉపయోగింపనేర్చితే, గృహలక్ష్మి విశేషంగా బాధపడనవసరముండదు. గోధుమతో ఇతర పదార్థములనుచేర్చి పాకపు ఉత్పత్తివృద్ధి చేయవచ్చు. వంకాయ, బంగాళాదుంపలు, కాబేజి, కారెట్, అరటికాయమున్నగు యెన్నింటితోనోకలిపి కిచిడీగా వండుకోవచ్చు. కొబ్బరి, పాలు, బెల్లం చేర్చికూడా వంటకం తయారు చేయవచ్చు. ఇల్లాంటి అనేక ఉపాయాలచేత గృహలక్ష్ములు వంటగదినుండి దైన్యాన్ని పారద్రోలి చిరునవ్వు వెన్నెలల వెల్లివిరియచేతురుగాక !

## భారత స్వాతంత్ర్య చరిత్ర రచన

భారత స్వాతంత్ర్య చరిత్ర రచనకు పూనుకొనవలయుననియు, అది 5 సం॥లలో ముగియవలయుననియు ఇందు కేర్పడ్డ ప్రవీణుల సంఘమువారు తీర్మానించినారు. 1857 నకు పూర్వచరిత్ర యొకభాగము, 1857-1917 మధ్యకాలమునుగూర్చి మరియొకభాగమును; ఆ పిదప మూడవభాగమును - ఇట్లు 3 భాగములుగా రచింతురని తెలియవచ్చినది. ఈ 3 కాలములందును పురుషులతోపాటు స్త్రీలును స్వాతంత్ర్య పోరాటమున పాల్గొనిన విషయము ఎల్లరికి తెలిసినదే. గాంధీ యుగమున స్త్రీలు ప్రత్యక్షముగా పాల్గొని జైళ్ల కేగియున్నను ఆ ముందు కాలమున పలుసాహసము లొనర్చిన పురుషవర్యుల భార్యలు, తల్లులు, తనయలు చూపిన ధైర్యస్థైర్యములు వర్ణనాతీతములని గుర్తింపవలయును. రావణ సంహారకారిణి అమోఘమగు రామబాణమేకాదు; 'సీతమ్మశోకమును' అందుకు ప్రబలకారణమే. అట్లే ఆయావారి బంధువులు పడినపాట్లున్ను ఇందుకు తోడ్పడినవనవచ్చును. కావున ఈ చరిత్రయొక్క 3 భాగములందును స్త్రీల చరిత్రకు అర్హస్థాన మిత్తురని భావింతుము.

## ఆహారపదార్థాల కల్తీ

ఆహారపదార్థాల కల్తీవల్ల నిజముగా బాధపడునది గృహలక్ష్మి. బియ్యములో వడ్లు, రాళ్లు ; ఆవాలలో రాగులు; జీలకర్రలో పుల్ల, దుమ్ము ; నేతిలో నూనె, మారువా, క్రొవ్వు, అరటిపండ్లు ; ప్రియమైన నూనెలలో చౌకబారు నూనెలు; పప్పులలో రాళ్లు; మేలురకము పప్పులలో హీనరకము పప్పులు; పాలలో నీళ్లు; పశువుపాలలో పాలపొడి; బెల్లములో పేడ ; చక్కెరలోపిండి; సీకాయపొడిలో తవుడు-ఇట్లెన్ని చెప్పుదుము: ఈ పదార్థములు బాగుచేయుట యొక కష్టతరమైనపని; కొన్ని బాగుచేయుటయు అసాధ్యము. ఇట్టివానితో వంటచేసినను రుచిపాకముగావించుట దుస్సాధ్యము. కావున దీని నరికట్టుట ప్రభుత్వధర్మము. ఇందుకై కేంద్రప్రభుత్వమువారు అచిరకాలములలో నొకబిల్లు తీసుకొనిరానున్నారని శ్రీమతి రాజకుమారి అమృత కౌరుగారు పార్లమెంటులో నుడివిరి. ఇందుకు వారి నభినందించుచున్నాము. అయితే కేవలము చట్టమొనర్చి లాభములేదు; దానిని నిక్కచ్చిగా అమలు జరుపుటకూడా అవసరము.






గీటురాయి: తెలుగు & ఇంగ్లీషు వారపత్రిక. ప్రధాన సంపాదకులు: కోట వెంకట రంగం బి. ఏ. గారు; సంపాదకులు: జవ్వాజి సుబ్బరాయ గుప్తగారు. సహాయ సంపాదకులు: ఆలపాటి సాంబశివరావుగారు, సంతపేట, నెల్లూరు. సాలుచందా: రు 6-0-0 విడిపత్రిక వెల రు 0-2-0.

నెల్లూరు ఎన్నో పత్రికలకు పుట్టిల్లు. అంతరించిపోయినవి పోగా మిగిలియున్నవే చాలా. ఆర్థిక, వాణిజ్య, పారిశ్రామిక విషయములగూర్చి ఈ పత్రిక ప్రచారము చేయునట. వీటితో అవినాభావముననున్న రాజకీయముల ప్రస్తావనయు తప్పదు. ఇది ఖరనామ సం॥ ఉగాదినాడు ప్రారంభమైనది. ప్రథమ సంచికలో సంపాదకులు చూపిన తూకమును నిలుపగలరేని సంపాదకులు పత్రికకు మంచి వ్యాప్తిని సంపాదింప గలరు.

సూర్యనమస్కారములు: శ్రీ కందాళై వెంకటాచార్యులుగారు. గుప్తవిద్యా మండలి, బెజవాడ వెల రు 0-8-0

ఈ పుస్తకమునందు శారీరకముగాను, మానసికముగాను అభివృద్ధినొందుటకు సూర్యనమస్కారముల యొక్క ఆవశ్యకత వివరించబడియున్నది. ఆరోగ్యము కాపాడుకొనుటకు, అనారోగ్యమునుండి విముక్తులగుటకు సూర్యనమస్కారముల అభ్యాసం ఎట్లుపకరించునో యీ పుస్తకమునందు వ్రాయబడియున్నది.

సూర్యనమస్కారములు చేయువిధానము పది అభ్యాసములుగా భాగించబడి పటములతో సహా వివరించబడియున్నది. ఇది చాల ఉపయోగకరమైన పుస్తకము. ముఖ్యముగా యీకాలంలో అనేక దురలవాట్లకు గురియగుచున్న యువతీయువకులు యీ పుస్తకమును చదివి, అందలి సూచనల ప్రకారం సూర్యనమస్కారముల నభ్యసించినచో శారీరక, మానసిక ఆరోగ్యముల పొందుదురు; ఆధ్యాత్మిక శక్తుల పెంపొందించుకొందురు.

తిక్కన: శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మగారు. ప్రాచ్యసాహిత్య విజ్ఞానపరిషత్తు, గుంటూరు లేక ఆంధ్రసేవాసమితి, పెదనిండ్రకొలను, పశ్చిమగోదావరిజిల్లా. రు 1-0-0.

భారతము నాంధ్రమున రచించిన మహాకవులలో నొకడగు తిక్కన జీవితమందలి పరమార్థములను కొన్నిటిని వస్తువుగా గ్రహించి కవి ఈ నాటికను తయారు చేసినాడు.

భావసరళమైనది. కవిబ్రహ్మను మహాకవిగానే కాక రాజనీతిచతురునిగను కవి యీ గ్రంథమున సృష్టించినాడు. తిక్కనవంశస్థుల ఔన్నత్యము, మొదలగు కవిజీవితమును తెలిసికొనుట కవసరమగు విషయము లీగ్రంథములో కలవు. తిక్కన ఎల్లప్పుడు దేశక్షేమం, ప్రజాక్షేమం ఆశించిన ఆదర్శప్రాయుడని యీ పుస్తకము చదువను చదువను తెలిసికొనగలము.

ఇందు ఆంధ్రుల ప్రాచీనవైభవము చక్కగా చిత్రింపబడియున్నది. ఇందలి సంభాషణలలో ఉచితస్థానములందు గొప్పరాజనీతి, ధర్మాది విషయచర్చ జరిగినది. చాలావరకు తిక్కన జీవితములో ఐతిహాసికులు నేటివరకు తెలిపినవిషయములు చిత్రించబడినవి. పుస్తకము చదివినంతసేపు ఉత్సాహవంతంగానుండును.

ఇట్టినాటికలు భాషాభివృద్ధికి ఉపకరించును. ప్రాచీనవైభవమును స్ఫురణకు తెచ్చుటయే కాక ప్రజలలో రాజనీతి, సామరస్యముల ప్రబోధమునకుకూడ ఎంతయైన సహాయపడగలవు.

సి. సి. పున్నయ్య.

# శ్రీ ఖరనామ సంII చైత్ర వైశాఖమాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | సో | ద 58.53 ఆర్ద్రే 44.34 దివ 14.39 ధర్మరాజ దశమి. |
| | 17 | మం | ఏ 60.10 మఘ 40.45 దివ 16.9 |
| | 18 | బు | ఏ 0.52 పుబ్బ 49.42 దివ 8.25 |
| | 19 | గు | ద్వా 0.59 ఉత్తర 50.20 దివ 1.54 సత్యవ్రతం. |
| | 20 | శు | త్ర. 0.23 హ 50.1 దివ 11.13 |
| ఏప్రిల్ నెల | 21 | శ | ○ పూర్ణి 53.32 హ 16.59 దివ 9.29 చిత్రపూర్ణిమ. |
| | 22 | ఆ | కృష్ణపా 49.48 స్వా 45.50 దివ 1.50 |
| | 23 | సో | వి 43.35 విశా 42.23 రావి 20.25 |
| | 24 | మం | త 30.36 అనూ 38.20 రావి 20.58 |
| | 25 | బు | చ 31.14 జ్యే 33.54 రావి 21.1 |
| | 26 | గు | పం. 24.45 మూ. 29.21 దివ 25.39 గురుపంచమి. |
| | 27 | శు | ష. 18.26 పూ.షా. 25.0 రావి 12.15 |
| | 28 | శ | స. 12.25 ఉషా. 21.3 దివ 30.30 |
| | 29 | ఆ | అ 0.2 శ్ర. 17.48 ది 20.25 |
| | 30 | సో | న 2.33 ధ. 15.28 రావి 1.34 |
| 1951 సంII | 1 | మం | ఏ 50.20 శత 14.13 దివ 30.13 |
| | 2 | బు | ద్వా 56.22 పూభా 14.9 రావి 7.1 |
| | 3 | గు | త్ర 50 5 ఉభా. 15 20 రావి 14.52 |
| | 4 | శు | చతు. 54.4 రే. 10.44 త్యాజ్యాభావః |
| | 5 | శ | ● అమా. 60.10 అశ్వ 21.12 దివ 10.51 |
| | 6 | ఆ | ● అమా. 0.28 భర. 25.30 రావి 26.31 |
| | | | వైశాఖమాసం. |
| | 7 | సో | శుక్లపాడ్య 3.58 కృ 30.50 పునస్త్యాజ్యాభావః |
| మే నెల | 8 | మం | విదియ 8.5 రో. 36.35 దివ 14.40 పరశురామ జయంతి. |
| | 9 | బు | త. 12.30 మృ 42.34 త్యాజ్యాభావః |
| | 10 | గు | చ. 16.57 ఆ 48.32 దివ 5.40 |
| | 11 | శు | పం. 21.26 పున 54.14 దివ 21.23 శంకర జయంతి. |
| | 12 | శ | ష. 25.21 పుష్య 59.22 దివ 15.50 |
| | 13 | ఆ | స. 25.35 ఆర్ద్రే 60.10 రావి 1.53 భానుసప్తమి ; గంగోత్పత్తి. |
| | 14 | సో | అ 30.50 ఆర్ద్రే 0.50 రావి 3.50 |
| | 15 | మం | న 32.16 మఘ 7.12 దివ 24.1 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# కేసరి రత్నత్రయము

## లోధ్ర

గర్భాశయరోగనివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును. లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగు బంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్ట ప్రదాయినియని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

12 ఔ. రు. 4-0-0    6 ఔ. రు. 2-2-0

## అమృత

రక్తశుద్ధిద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సునుయిచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 4-0-0    6 ఔ. రు. 2-2-0

## అర్క

సర్వజ్వరనివారిణి

ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమికూటముచేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములను, కడుపులో ప్లీహమను జ్వరగడ్డను కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔన్సు బుడ్డి రూ. 1-2-0

తపాలా ఖర్చులు ప్రత్యేకము

## కేసరి కుటీరం లిమిటెడ్

ఆయుర్వేద ఔషధశాల

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంటు:

సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు..

లోధ్ర

FOR LADIES' HEALTH

Lodhra

KESARI KUTEERAM LTD.
INDIAN CHEMISTS & DRUGGISTS MADRAS

KESARI KUTEERAM LTD
ROYAPETTAH MADRAS

ఆడుజన్మను సార్థకపరచే
ఆరోగ్యప్రదాయిని

Lodhra Press, Madras.14